

**మాక్సిమ్ గోర్కీ శిలాప్రతిమ.**

—శిల్పి వీరా ముఖీనా. (టాస్ వార్తా సంస్థ)

సంవత్సర చందా
రు 12-0-0
విడిప్రతి 4 అ

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder K NAGESWARA RAO

సంపుటము 45
సంచిక 13
19.11-52

నందన మార్గశిర శుద్ధ విదియ బుధవారము



రాజదంపతులు

—శ్రీ శాంతి ఎం. షా గారు నీటిరంగులతో చిత్రించిన చిత్రం

# విషయానుక్రమణిక



## గమనిక.

ఆంధ్ర పత్రిక సచిత్ర వార పత్రిక పిల్లల దసరా సంచికలో "బాపూజీ" అను శీర్షికతో ఆర్. రేచల్ అనువారు పంపిన కొన్ని పద్యములు ప్రకటింపబడినవి. ఈ పద్యములు రేచల్ వ్రాసినవి కావనీ, శ్రీ వట్టికూటి గోపాలరావుగారు ప్రకటించిన "ఆవేదన" అను ఖండకావ్య సంపుటి నుండి తస్కరించబడినవనీ మాకు తెలియవచ్చినది. ఈ గ్రంథ చౌర్యమును మాతోపాటు పాఠకులు కూడ గర్హిస్తారని మా విశ్వాసం.

—సంపాదకుడు

# ఆంధ్రపత్రిక

## సచిత్ర వారపత్రిక.

# సంక్రాంతికి ప్రత్యేక సంచిక, కథలపోటీ

రాబోయే సంక్రాంతికి (14-1-1953) ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రిక ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. ఈ సంచికలో ప్రత్యేకాకర్షణగా కథలపోటీని ఏర్పాటు చేయదలచాము. గ్రామీణ వాతావరణం, గ్రామీణ జీవితం, గ్రామీణసమస్యలు ఆధారం చేసుకుని, మా వార పత్రికలో ఆరుపేజీలకు మించకుండా, స్వతంత్రంగా రచించబడిన కథానికలను పోటీకి స్వీకరిస్తాము. మొదటి బహుమతి కథకు 75 రూ॥లు, రెండవ బహుమతి కథకు 50 రూ॥లు ఇవ్వబడుతుంది. పోటీలో యావన్మంది రచయితలు పాల్గొనవచ్చును.

**పోటీ కథానికలు డిసెంబరు 1 వ తేదిలోగా మా కార్యాలయానికి చేరాలి.**

సంక్రాంతి సంచికకు ఇతర కథానికలు, గేయాలు, పద్యాలు, ఛాయాచిత్రాలు, లిఖితచిత్రాలు పంపగోరేవారు కూడా డిసెంబరు 1 వ తేదీలోగా పంపగలరని ఆశిస్తున్నాము. ముఖ్యంగా ఛాయాచిత్రాలు, లిఖితచిత్రాలు గ్రామీణ వాతావరణం, సంక్రాంతిపండుగ దృశ్యాలు చూపించేవైతే మరీ సంతోషం.

పోటీకి పంపే కథానికలను "సంక్రాంతి సంచిక కథానికల పోటీకి" అనీ, సంక్రాంతి సంచికకు పంపే ఇతర రచనలను లిఖిత చిత్రాలను "సంక్రాంతి సంచికకు" అనీ స్పష్టంగా వ్రాయాలి.

సంక్రాంతి సంచికను సాధ్యమైనంత ఆకర్షకంగా వెలువరించాలని మా ప్రయత్నం. పాఠకులు, రచయితలు, అభిమానులు మా యీ ప్రయత్నానికి సర్వవిధాలా సహకరిస్తారని ఆశిస్తున్నాము.



# కాలక్షేపం



"చెలువొ రత్నఘటంబునం దతడు
సుశ్రీఖండ ఖండంబులన్
తిలపిణ్యాకము వండె;- నారుగల
కర్డిన్ సప్త పర్ణావృతుల్
నిలిపెన్;- జిల్లెడు దూదికై పుడమి
దున్నెన్ బైడి నాగేళ్ళ, ని
మ్ముల;- గర్మక్షితి బుట్టి యెవ్వడు
తపంబుల్ సేయ డప్రాజ్ఞతన్."

కర్మభూమి యైనటువంటి యీ పవిత్ర (భారత) భూమియందు జన్మించియు అప్రాజ్ఞుడై తపస్సు చేయనటువంటి వాడున్నూ-మంచిగంధపు చెక్కల ముక్కలతో రత్నఖచితమైన పాత్రలో తెలకపిండిని (తిలపిణ్యాకము) వండినటువంటి వాడున్నూ - ఆరుగలకొరకై అనగా ఆర్లు (అనబడే చోళ్లవంటి ధాన్యం) పైరు చేయుటకై ఏడాకుల అరటి (సప్తపర్ణ) అనబడు కర్పూరపు అరటిచెట్లను నరికి చుట్టూ ఆవరణ (ఆవృతుల్) నిలుపువాడున్నూ- జిల్లేడు దూదికొరకై బంగారు నాగళ్ళతో భూమిని దున్నినవాడును; - ఒక్కటే - కర్మభూమి అంటే భారతదేశమే అని ఒక విధమైన జగత్ప్రిసిద్ధి ఏర్పడింది. ఇతర దేశాలలో మాత్రము అక్కడి ప్రజలకు ఏ విధమైన కర్మకాండలూ లేకుండా ఉన్నారా? మనదేశంలో, మన హిందూ సంఘంలో మాత్రమే కర్మకాండ అనేది వెలసినదా? అని ప్రశ్నించవచ్చు. ఇతర దేశాలలోనూ, యితర జాతులవారిలోనూ, కర్మకాండలు అనేవి వారివారి మత సిద్ధాంతాల ప్రకారంగా ఏర్పడిఉన్నాయి. ఆ కర్మకాండలను యథాశక్తిగా వారు కూడా వారివారికిగల దీక్షాసక్తిని అనుసరించి ఆచరిస్తూనే ఉన్నారు.

కాని, ఆ దేశాలలో ప్రత్యక్ష వ్యవహార ప్రపంచంలో దేహసంరక్షణ అనేదిన్నీ దేహపోషణ అనే దిన్నీ, నిత్యకృత్యకృత్యాద్యవస్థగా ప్రకృతి సిద్ధంగా ఏర్పడింది. అవి అమితమైన చలిదేశాలు. చలికాచుకొనుటకు అందరి యిళ్ళల్లో సెగళ్లుండాలి. కట్టెలు గాని నేలబొగ్గుగాని అందుకొరకై కాలుతూ ఉండాలి. ఈ ఖర్చు వారికి తప్పదు. ఇంగ్లండులో శీతకాలం ప్రవేశిస్తే, చలితో దేశంఅంతా గజగజలాడిపోతుంది. రాత్రిళ్లు కురిసిన మంచు ముక్కలతో వీధులన్నీ హిమాలయపథము లవుతాయి. ఆ గడ్డకట్టిన మంచుపొరలను వీధులలో త్రవ్వి పారవేయడానికి ప్రత్యేకంగా కొందరు మనుష్యులు పనిచెయ్యాలి. అటువంటి శీతకాలంలో ఇళ్లల్లో సెగలు వేసికొనుటకు నేలబొగ్గు ఎక్కువగా ఖర్చు అవుతుంది, సరిగ్గా అటువంటి యమ చలికాలంలోనే ఒక యేడు నేలబొగ్గు గనుల పనివాళ్లు సమ్మెచేశారు. అందువల్ల ఇళ్ళల్లోని సెగళ్ళకు బొగ్గుసప్లయి తగ్గిపోయింది. ఇక చూచుకోండి. ఆ సంవత్సరం ప్రజలు పడిన అవస్థ ఇంతా అంతా కాదు. మన దేశంలో ఎండ వేడిగాడ్పులకు చనిపోయే జనంకంటె, అత్యధికజనం చలిదేశాలలో చలిబాధవల్ల మరణిస్తారు. అదిన్నీ గాక, వాళ్లు ఉన్నిదుస్తులు ఎప్పుడూ విడువకుండా ఆపాదమస్తకం ధరించి ఉంటేనే గాని ఆ చలికి ఆగలేరు. ఉన్ని దుస్తులకు అయ్యేఖర్చు చాలా ఎక్కువ. ఇంట్లో కుటుంబంలోనివారందరికీ ఆబాలగోపాలం ఉన్నిదుస్తులు ఉండాలి. కాళ్ళకు బూట్సులు మేజోళ్లు ఉండాలి. పొలంలో పనిచేసే రైతుకూడా హాట్, సూట్, బూట్ లేనిదే పని చెయ్యలేడు.

ఆ సెగళ్ళవల్లనూ, యీ నిండు ముస్తాబులవల్లనూ, చలిబాధ కొంతవరకే తగ్గుతుంది. కాని, బయటికి రావాలంటే భయంగానే ఉంటుంది. ఒళ్ళు వేడి ఎక్కితేనే తప్ప ఏ పని చెయ్యడానికీ, హుషారుగా ఉండదు. ఈ హుషారుకోసం నిషా పానీయం పుచ్చుకుంటేనే గాని ఖుషీగా పని చెయ్యలేరు. సారా లేనిదే జీవితానికి సారస్యమే లేదు.

బ్రాందీ, వైన్, విస్కీ, రం, బీర్ మొదలైనవి ఆయా తరగతులవారి తాహతుకొద్దీ ఉండాలి. రాజు మొదలు రైతువరకూ, గృహస్థుమొదలు సన్యాసివరకూ, పసిపాప మొదలు ముసలి తాతవరకూ ఏదో ఒక రూపంలో "ఆల్కహోల్" (సారా) చేరిన పదార్థం సేవించాలి. ఇంగ్లీషు వారి ఔషధాలు కూడా అనేకం "టింక్చర్సు" రూపంలోనే అనగా సారా మిశ్రమమైన అరఖులుగానే తయారు చేయబడినవై యున్నవి.

ఈ ఉద్దీపన పానీయములకోసం జనసామాన్యానికి ఖర్చు తప్పదు. మద్యానికి తగిన ఆహుతి కడుపులో పడాలి. పుష్టిగా ఆహారం భుజించకపోతే, సారావంటి ద్రవ్యం శరీరసారమునే దహించి వేస్తుంది. ఇంతేకాదు. ఈ నిషాద్రవ్యముల కలవాటు పడినవారికి డాన్సులు మొదలైన స్త్రీపురుష రాసక్రీడలు ఉండాలి. ఒకని భార్యను ఇంకొకడు ఆలింగనం చేసికొని ఆమె భర్త ఎదుటనే డాన్సు చేయవచ్చు. ఇది సంఘమర్యాద కూడాను. పరస్త్రీలను, ఆలింగనం చేసికొని, ముద్దుపెట్టుకొని, రైలు ఎక్కేటప్పుడు వీడ్కోలు సన్మానం వారిలో చేస్తారు. అది వారికి మర్యాద. పరస్త్రీల పరస్పర అంగాంగి సంస్పర్శలతో రాసక్రీడలు సాముదాయికంగా వారు చేస్తారు.

అవి వారి సంఘ మర్యాదలుగా, వారి సంస్కార సంప్రదాయంగా ఏర్పడ్డాయి. అవి లేకపోతే వారికి జీవితం కళారహితంగా ఉంటుంది. వారికి ఇట్టి బాహాట ఘనజఘనముల సమాలింగనాదులు లేకపోతే లంఘనములు చేసినట్లే ఉంటుంది వారి సాంఘిక సాంసారిక జీవితంలో.

ఈ విధంగా ఆ చలిదేశాలలో వారి జీవితప్రవృత్తి యెట్లా మారిందో తరచి చూచినకొలదీ అది వాళ్ళ "కర్మ" అని చెప్పిముగించక తప్పదు. వాళ్ళ గతి వాళ్ళదే అని, వాళ్ళ ప్రస్తావనకిక స్వస్తి చెప్పి, "పుండరీకాక్ష! పుండరీకాక్ష! పుండరీకాక్ష!" అని మూడుసార్లు స్మరించి, వాళ్ళ స్మరణ యిక ముగించవలసిందే.



# కాలక్షేపం



చలిదేశాలలో వివిధజాతుల ఫలవృక్షములు గాని పంటపైరులు గాని, సుగంధ ద్రవ్యాలుగాని వనౌషధులుగాని, ఉష్ణదేశాలలో ఉత్పత్తి అయినట్లుగా వృద్ధియై సమృద్ధిగా పెరిగి పెంపొందవు. అటువంటి పరిస్థితిలో ఆ ప్రజల జీవిత సౌఖ్యానికి కావలసిన అనేక వస్తుసామగ్రులకొరకై వేడి దేశాలకు రావాలి. అందువల్ల వారికి సామ్రాజ్యాలు కావాలి. ఈస్టు యిండియా కంపెనీల వంటి కంపెనీ లేర్పడి యితరదేశాలకు వెళ్లి వ్యాపారంచేసి సరకులు తెచ్చుకోవాలి. లేదా కృత్రిమ సాధన విధానాలమూలంగా విశ్వామిత్రసృష్టి చేయాలి. నీలిమందు పండించకుండా నీలిమందు తయారుచేయవచ్చు. మూలికలు లేకపోతే మాయమందులు తయారుచేయాలి. కృత్రిమ వస్త్రోత్పత్తి ఎందుకంటే సహజోత్పత్తి లేదుగనుక. కృత్రిమ రబ్బరు, కృత్రిమ సెంటు సువాసనలు, కృత్రిమ ఆహారాలు, ఈ విధమైన కృత్రిమ ఆహార విహారాలతో జీవితమే కృత్రిమ జీవితం అవుతోంది. ఇదంతా ఎందుచేత? శతకోటి దరిద్రానికి అనంతకోటి ఉపాయాలు. కనుక వీరి చిత్తప్రవృత్తికి కూడా కృత్రిమ కుతంత్ర స్వభావం ఏర్పడుతోంది. నల్లవాళ్లను ఆఫ్రికా ఖండంలోనుంచి వెళ్ళగొట్టి తామే ఆక్రమించుకొని అక్కడి వస్తుసంపదను అంతా తామే అనుభవించాలని తెల్లవాళ్ల సంకల్పం. తమకు ఎదురు తిరిగి మాట్లాడినందుకు కెన్యా రాజ్యంలోనివాళ్ళను కొరడాలతో కొడుతున్నారు. ఆస్ట్రేలియాలోని ఆదిమనివాసులను తెల్లవాళ్ళు వేటాడినారు కొంతకాలం. అమెరికాలోని రెడ్ యిండియన్ జాతివారిని తెల్లవాళ్ళు యీ రోజువరకూ నిరసించి హింసిస్తూనే ఉన్నారు. ఇంతకూ చెప్పవచ్చిం దేమిటంటే,

దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుషులోయ్

అనే మాట గురజాడఅప్పారాయ కవి చాలా స్థూలంగా చెప్పినటువంటిది. కాని, దేశము యొక్క ప్రకృతి ఎటువంటిదో ఆ దేశములో ఆ గడ్డమీద పుట్టినటువంటి పెరిగినటువంటి మనుష్యుల తత్వం కూడా, ఆ దేశ స్వభావాన్ని బట్టి, ఆ భూస్వభావాన్ని బట్టి, ఆ భూసారమును బట్టి ఒక మూసలో పోసినట్లుగా ఆకార గుణ వికారము పొంది పక్వమౌతూ ఉంటుంది. తెల్లవాళ్లు ఆ విధంగా ఉండడం ఆ సీమదేశాల ప్రభావం. ఆ నేల అటువంటిది—ఆ మన్ను అటువంటిది. ఆ మన్నును బట్టియే మనుష్యులు ఉంటారు. కాబట్టి దేశమంటే ప్రధాన వస్తువు ఆ దేశపు మన్ను - ఆ దేశపు నైసర్గిక ప్రకృతి.

దేశమంటే మన్నుసుమ్మీ
దేశమంటే మనిషి కాదోయ్

అని అన్వయించడం కూడా అవసరం. ఎందుచేతనంటే, దేశంయొక్క స్వభావసిద్ధమైన ప్రకృతి ఎక్కువ స్థిరస్థాయిగా ఉంటుంది. దేశంలో ఉండే మనుష్యులు అనేక తరాలవారు వస్తూఉంటారు పోతూ ఉంటారు. అనేక అన్యజాతీయ సంపర్కదోషాలకు పాలవుతూ ఉంటారు. దేశం అంటే స్థిరమైన మూలపదార్థమగు భూమి.

*Rule Britania rule !*
*Britania rules the waves !*

"రూల్ బ్రిటానియా రూల్ !
బ్రిటానియా - రూల్స్ - ది - వేవ్స్"

అని బ్రిటిష్‌వారు జాతీయసమరగీతం పాడుకున్నారు.

పాలించు ! పాలించు ! హో అంగ్ల దేశమా!
"అలలనే శాసించు- నాంగ్లేయరాజ్యం!

అని వారి జాతీయమరసగీతానికి మకుటం. వారు సముద్రాలు పాలించుకొనుచూ సముద్రాధిపత్యం సంపాదించుకొని, సామ్రాజ్యాలకోసం అన్యదేశాలపాలు కావలసివచ్చింది. వారు నేల విడిచి నీటిమీద సాము చేశారు. నిన్న మొన్నటివరకు యుద్ధ నౌకాదళంలో వారిదే అగ్రస్థానం. కాని అది నేడు వారిది కాదు. అమెరికావారి దీ అగ్రస్థానం. వారి స్వదేశాన్ని వారి గీతంలో కీర్తించుకోకుండా వారి జాతీయవైభవం అంతా సాగరంపాలు చేశారు.

భారతదేశాన్ని "సుజలాం సుఫలాం మలయజ శీతలాం" అని కీర్తించాము. సస్యశ్యామలమైనది. చల్లని, తియ్యని జలప్రవాహాలు, బహువిధ ఫలవృక్షములు కలది. ఇటువంటి దేశం విడిచిపెట్టి దీనికంటె మరొక దేశం బాగున్న దనేవాడు అవివేకి- అజ్ఞాని - అప్రయోజకుడు అవుతాడు.

ఇటువంటి దేశంలో మోకాళ్లు దాటని అంగవస్త్రంతో హాయిగా కాలక్షేపం చేయవచ్చు. చక్కని వెన్నెలలో చల్లగాలికి నిద్రపోవచ్చు. అందుకనే గాంధి మహాత్ముడు "*Glorious Climate of India*" భారతదేశపు ఋతుగతి మహాద్భుతమైనది" అని వ్రాశాడు. ఇటువంటి దేశంలో నిరాడంబరంగా కొల్లాయిగుడ్డ కట్టుకొని ఏ కొరత లేకుండా జీవించవచ్చునని మహాత్ముడు ప్రబోధం చేశాడు. కీ॥ శే॥ బసవరాజు అప్పారావు గారు మహాత్ముని కీర్తించినట్లుగా

"కొల్లాయిగట్టితే నేమి ?
కోమటై పుట్టితే నేమి ?"

ఈ కోమటి యింగ్లీషువారి ఈస్టుయిండియా కంపెనీతాలూకు వర్తకుని బాపతువాడు కాడు. వాణిజ్యానికి సామ్రాజ్యాలు కావాలనే కాంక్ష యీ దేశపు కోమటికి ఉండదు. ఈ దేశపు క్షత్రియుడు కోమటికి వెనుక వాంగుగా ఉండి, వర్తకపు కంపెనీల వ్యాపారాలను క్షత్రియుడు తన కత్తులు కటారులతో సాగించవలెనని శాసించడు. ప్రజలను యుద్ధాలకు పురికొల్పెడి క్షత్రియుని కత్తికంటె మన మహాత్ముల యొక్క ఆత్మశక్తి అనేక రెట్లు అమోఘమైనది.

"చేరి భిక్షాన్న మారగించెదము మేము
కట్టెదము దిక్కులనియెడి-కలితశాటి
బవ్వళించెద మిలయను పాన్పుమీద
నేమి కార్యము మాకు నరేంద్రులందు."

తా॥ భిక్షాన్నము భుజింతుము. దిగంబరులమై యుందుము. నేలపై శయనింతుము. రాజులతో మా కేమిపని ?

ధరణి విశాలతల్పః ముపధానము
బాహువు; నింగి చందువా;

సురటును గంధవాహములు;
శోభనదీపము చందురుండుగా;
విరతి వధూమణింగలసి
వేడుకమీర సుఖించి, శాంతుడై,
నిరుపమలీల యోగి శయ
నించు, మహీపతిషూళి కైవడిన్.

తా॥ "భూమియే రమ్యమైన పాన్పు; తల క్రింద పెట్టుకొన్న చెయ్యియే తలగడ; ఆకాశమే చక్కని చాందిని; చల్లని గాలియే పంకావంటిది; ప్రకాశించుచున్న చంద్రుడే శోభనదీపము; ముక్తికాంతతో కలసి వేడుకతో సుఖిస్తూ ఉంటేటటువంటి యోగి మహారాజువలె యోగనిద్రలో తన్మయుడై యుండును".

ఇటువంటి యోగిపుంగవులకే అగ్రస్థానమిచ్చింది భారతదేశం. "భారతదేశం కర్మభూమి" అంటే ఆ మాటయొక్క నిశ్చితార్థం పశ్చిమరాజ్యాల కళ్ళనలకు తెలియదు. "కర్మ" అంటే "పని" - అమెరికాలో కర్మాగారములు అపారంగా ఉన్నాయి. కనుక అవిధంగా అన్వయిస్తే అసలు కర్మభూమి అమెరికా అవుతుంది. కార్మికులకే అగ్రస్థానం రష్యాలో యివ్వబడింది. కనుక కార్మికులకే అక్కడి ప్రభుత్వాధికారం సంక్రమించింది. కార్మికలోకానికి పట్టాభిషేకం చేసిన రష్యాకంటె మించిన కర్మభూమి లేదని రష్యనులు అన్వయించవచ్చు. కాని, భారతదేశంలో "కర్మయోగి" అనే మాటకు ఉన్న అర్థం అది కాదు. పాశ్చాత్య అన్వయానికి పూర్తిగా విరుద్ధమైనది. ఇక్కడి కర్మయోగులు తాము చేసేటటువంటి కర్మమూలంగా కర్మపాశ విముక్తిని పొందగోరుచున్నారు.

"మోహ పాశములబాసి
సహింతురు కర్మ బీజమున్."

కర్మను నిర్మూలించేటటువంటి కర్మ యీ దేశంలోని కర్మిష్ఠులు చేస్తారు.

మను చరిత్రలోని ప్రవరుడు "ధర్మకర్మ దీక్షా పరతంత్రుడు" అని వర్ణింపబడినాడు. వరూధిని అనే ఒక గంధర్వ స్త్రీ యింటికి దారి తెలియక వెళ్లాడు. ఆమె నివాసంగా ఉంటేటటువంటి తోట, యిల్లు వగైరా చూస్తే, అమెరికాలోని దేవేంద్రభవన భోగములతో తులతూగుతూ ఉంది.

"బహు రత్నద్యుతి మేదురోదర
దరీ భాగంబులన్ బొల్పు ని
మ్నగహా కాహార్యమునన్ జరింతు
మెపుడున్ ప్రేమన్; నభోవాహినీ
లహరీ శీతల గంధవాహ
పరిఖేల న్మంజరీ సౌరభ
గ్రహ సేందిందిరతుందిలంబు లివి
మత్కాంతార సంతానముల్."

తా॥ అనేక రత్నముల కాంతిచే శోభించుచున్న పర్వత చరియలుగల యీ మంచుకొండ ప్రాంతంలో మేము విలాసంగా విహరిస్తూ ఉంటాము. ఆకాశగంగ నుండి వీచెడి చల్లనిగాలిలో వెల్లివిరియుచున్న పుష్ప సువాసనలను గ్రహించిన తుమ్మెదల దండుతో దట్టముగా నిండినటువంటి మా వనములు ఇవి.

అని వర్ణింపబడింది. అక్కడ ద్రాక్షతీగెలు పండ్ల గుత్తులతో ఉన్నాయి. ఇక్కడ సకలసౌకర్య సౌఖ్యాలు భాగ్య భోగ్యములు ఉన్నాయి. "నీవు కోరిన సౌఖ్యాలు"—కల విందు; భోగపరుడవై రమింపుము ననుగూడి యనుదినంబు"

అని వరూధిని ఆ ప్రవరునితో అన్నది. ఆ మాటకు ప్రవరుడు ఓంటిపాటున తడబడకుండా, చలించని చిత్తంతో జవాబు చెప్పాడు.

"నా
కరణుల్ దర్భలు నగ్నులున్ ప్రియములైన
ట్లన్యముల్ గా; వోడల్
తిరమే చెప్పకుమిట్టితుచ్ఛ సుఖముల్
మీసాలపై తేనియల్"

అని ప్రవరుడు నిరాకరించాడు.

పాశ్చాత్య ఆర్థికవేత్తలు *Standrad of Living* (జీవితభోగ పరిమితి) వృద్ధి అవుతూ ఉండాలి అంటారు. ఇట్టి పాశ్చాత్య ఆర్థికతత్వంలోనుంచి "ఆత్మసుఖభోగేచ్ఛల్ విసర్జింపుమా!" అనే ఆధ్యాత్మికతత్వంగాని, కర్మవిమోచన కొరకైన నిష్కామ కర్మయోగంగాని ఎన్నటికీ ఉద్భవించదు. హాట్, సూట్, బూట్ ధారుల సీమలలో హాలీవుడ్ స్టార్సు అర్ధదిగంబరులై అవతరిస్తే అవతరించవచ్చు. కాని, కర్మ నిర్మూలనార్థమైన కర్మయోగులు అవతరించరు. భారతదేశ వైస్రాయిగా ఉండిన రీడింగు ప్రభువుతో గాంధిమహాత్ముడు మాట్లాడుతూ, "ఆత్మబలముతో నా సత్యాగ్రహోద్యమాన్ని నడిపిస్తాను" అని చెప్పినప్పుడు, "ఆత్మబలం అంటే ఏమిటి?" అని ఆ రీడింగు ప్రభువు తనకది బోధపడక ప్రశ్నించాడు.

అది వారికి గ్రాహ్యంకాని తత్వం. ఒకవేళ వారికది గ్రాహ్యమైనా జీర్ణంకాని లేహ్యం వంటిది. ఆంగ్లకవి కిప్లింగు మహాశయుడు యీ విషయం చక్కగా ఒప్పుకొన్నాడు.

*"East is East and West is West*
*The twain shall never meet."*

"ప్రాచ్యదేశము ప్రాచ్యదేశమె
పశ్చిమంబది పశ్చిమంబే
పూర్వ పశ్చిమ దేశములకున్
పొత్తు కలియదు పుడమిలో."

అన్నాడు.

వారి కంటికి కన్పించేది భౌతికసౌఖ్యం; ఆర్థికసమస్య. వాటిని సమకూర్చేవారే, పరిష్కరించేవారే వారికి కావాలి. కాని అంతకంటె అతీతమైన ఆధ్యాత్మిక పారమార్థిక సమస్య ఒకటి ఉన్నది దానితో భౌతిక ఆర్థికసమస్యలను సమన్వయంచేసి చక్కని రాజమార్గమూ, సౌమ్యమైన రాజకీయ మార్గమూ, చూపించేవాడు మనకు కావాలి. రెండు దృక్పథములూ భిన్నమైనవి. ఎమర్సన్ అనే పండితుడు యీ విషయమే ఒక్క మాటలో చెప్పాడు.

*Two men looked through the*
*One saw the mud [window*
*And the other the stars*

"ఇద్దరు మనుజులు కిటికీగుండా
ఎదురుగ చూచిరి ఏకదీక్షగా —
మట్టిని చూసెను మానవు డొక్కడు
తారల జూచెను వేరొక డప్పుడె."

తా॥ మన జ్ఞాననేత్రములనే కిటికీగుండా యీ జగత్తును పరికించి మనమందరమూ చూస్తూనే ఉన్నాము. కొందరికి యీ నేల యీ మన్ను యీ పంచభూతాత్మకమైన ప్రపంచానికి మించినదేమీ కన్పించదు. కాని మరొకనికి యీ భౌతిక జగత్తు కంటె,

(9-వ పేజీ చూడండి)


మహానందిలోని దేవాలయం వద్ద తిరుగు కనిపించే దృశ్యాలలో ఇదొకటి. ఒక కోతి నిచ్చెన ఎక్కుతున్నది.
—ఫోటో ఆర్. యం. తుంబాలగారు

# [illegible]

“శ్రీరాగి”



జానకి ఉబుసుపోకకి వాకిట్లో గుమ్మం దగ్గర నిలబడి రోడ్డువెంబడి వచ్చి పోయే జనాన్ని పరిశీలిస్తున్నది. పదిగజాల దూరాన ఉన్న రామారావుని చూసి ఇంట్లోకి పోయి,

“అమ్మా, మామయ్య మన ఇంటికి వస్తున్నారే” అని తల్లితో చెప్పింది.

రామారావు జానకిమామ, సుమారు నలభై ఏళ్లుంటయి.

ఇంట్లోకి వస్తున్న రామారావుని జానకి తల్లి సుందరమ్మ చూసి “రండి, అన్నయ్యా” అని ఆహ్వానించి, కుర్చీ చూపించింది కూర్చోడానికి.

“అన్నయ్యా, 'ఇదేనా రావటం ఊరి నుంచీ.” అని అడిగింది సుందరమ్మ.

“అవునే. రాజమండ్రినుంచి, ఇప్పుడే వస్తున్నా. అంతా కులాసా ?”

“అంతా కులాసే నన్నయ్యా. అక్కడ, ఒదిన, పిల్లలు, క్షేమమేనా ?”

“ఆహా !”

“ఇంకా ఏమిటి సంగతులు?” అన్నాడు రామారావు.

“సంగతు లేమున్నయి నీకు తెలీనివి ? ఇట్లా ఉన్నాం.”

“జానకి బాగా ఎదిగిందే. దీని కిప్పుడెన్నో యేడొచ్చిందంటావు ?”

“మొన్న నే పదమూడో ఏడొచ్చింది”

“అయితే పెళ్ళీడు కొచ్చిందన్నమాటే. ఏమయినా సంబంధాలు చూస్తున్నారా?”

“అప్పుడే?”

“ఇంకా అప్పుడే నంటా వేమిటే సుందరం? మన కుటుంబం, 'మన సాంప్రదాయం చూసుకోనక్కర్లా? ఇంకా ఆగుతే రేపు అది సమర్తాడి కూర్చుంటే మన ప్రతిష్టకదూ నలుగురిలో?”

“ఇప్పుడంతా సమర్తాడిన తర్వాతే చేస్తున్నారుగా పెళ్లిళ్లు?”

“కొంపముంచి నీ కూతురికికూడా అలా చేద్దామనుకొంటున్నావా?”

“నేననుకోటానికి కాదు. మాకుటుంబం పరిస్థితులు నీకు తెలీని దేముంది? మీ బావగారి సంపాదన కూడు, గుడ్డకే సరిపోకపోతుంటే, పెండ్లేం చేస్తారు?”

“అందుకని ఎదిగిన పిల్లని ఇంట్లో అట్టే పెట్టుకొంటారా?”

“మరేం చెయ్యమంటా వన్నయ్యా?”

“ఏదో దొరికిన సంబంధం చూసి, గంతకు తగ్గ బొంత అని ముడిపెట్టాలిగాని, చేతులు ముడుచుకు కూర్చుంటే ప్రయోజన మేముంది?”

“ఏదో మీ అందరి సహాయం వుంటే, పెండ్లి ఎంతలో కవుతుందిలే అన్నయ్యా”

“సరే, మా సహాయాని కేంలే. ఈ రోజుల్లో ఎవరి సంపాదన వాళ్ళకి సరిపోక నానా అవస్థ పడుతుంటే ఇంకోళ్ళకి సహాయం ఎలా చేస్తారు సుందరమ్మా? నీవు యింకా పూర్వకాలం మాటలు మాట్లాడుతున్నావు. చూడు, నాకు నెలకు నాలుగు వందలొస్తోంది అన్నమాటే గాని, పదో తారీక్కి మళ్లీ నేను అప్పుకు బయలుదేరాల్సిందే, రోజుకి రెండు శేర్లు పాలు, నెలకి నలభైఅయిదు రూపాయలు. కాఫీపొడుం ఇరవై రూపాయలు. ఇట్లాగే అన్ని ఖర్చులూ. ఎంత చెట్టుకంత గాలి.”

“అవునులే అన్నయ్యా” అంది నిస్పృహతో సుందరమ్మ.

“అయితే నే యింక వస్తా. బావతో చెప్పు ఏదో ఒక సంబంధం చూసి జానకికి పెళ్ళి చేయమని. ఈ రోజుల్లో అన్నీ కలిసిన సంబంధాలు రావు. యేదో ఒక లోపం ఉంటూనే ఉంటుంది. చదువూ, డబ్బూ, అందం, అన్నీ ఉంటే, పెండ్లికొడుకు రెండో పెళ్ళి వాడవుతాడు. డబ్బుంటే చదువుండదు, చదువుంటే డబ్బుండదు అన్నీ ఉంటే కురూపిగా ఉంటాడు పెళ్లికొడుకు. ఏదో ఒకటి సరిపెట్టుకోవాలి. సరే : ఇట్లా అన్నానని బావతో చెప్పు. నా కవతల అర్జంటుపనుంది పోయొస్తా.”

“భోజనంచేసిపో అన్నయ్యా ఈపూట. ఎంత బీదవాళ్ళమైనా ఒకపూట భోజనం పెట్టలేకపోంగా ?”

“దానికిగాదు సుందరం. ఈమాటొచ్చినపుడొస్తాగా. వెళ్ళొస్తా. జానికి పెళ్లి విషయం మాత్రం తొందర చెయ్యిబావని. లేకపోతే మనకి నలుగురిలో తలవంపులు. వస్తా” అంటూ చెల్లెలు సుందరమ్మను చుట్టపుచూపుగా చూసి వెళ్లాడు రామారావు.

రామారావు, సుందరమ్మ ఒక తండ్రి బిడ్డలు. రామారావు అదృష్టవంతుడవటంవల్ల వ్యాపారంలో ఎలాగో డబ్బు సంపాదించి



భాగ్యవంతుడయ్యాడు. సుందరమ్మ సంసారం బీదకుటుంబంగానే ఉండిపోయింది. సుందరమ్మ భర్త రాజారావు చిన్న ప్రభుత్వోద్యోగి.

పది గంటలకు రాజారావు భోజనం చేసి ఆఫీసుకు పోదామని ఇంటికి వచ్చాడు.

రాజారావు భోజనం చేస్తున్నాడు.

"ఏమండీ, ప్రొద్దున మా అన్నయ్య వచ్చాడు." అంది సుందరమ్మ.

"మీ అన్నయ్య వచ్చాడా? మరి ఎక్కడా కనపడడేం?" అన్నాడు రాజారావు.

"అప్పుడే వెళ్ళిపోయినాడు."



"ఏమంత అర్జంటు? భోజనానికి ఉండమనలే?"

"అన్నానండీ, అర్జంటుపనుంది, మళ్లీ వస్తాలే అని వెళ్ళాడు."

"అయితే మరేమిటి సంగతులు?"

"ఒదినా వాళ్ళంతా కులాసాగానే ఉన్నారుట."

"ఇంకా?"

"ఇంకా ఏంలేదు. అమ్మాయి జానకి విషయం మాట్లాడేడు."

"ఏమన్నాడు?"

"జానకి పెండ్లీడు కొచ్చిందట."

"అప్పుడే! ఇంకా నయం. దాని కింకా న్నెండేళ్లు నిండందే."

"మొన్ననే వచ్చిందండీ, పదమూడో ఏడు."

"మరేం ఫర్వాలేదు. జానకి పెండ్లికి ప్పుడేం తొందరలేదు ఇంకా నాలుగయి ళ్ళు చక్కగా దాన్ని చదువుకోనీ."

"అది ఇంకోసంవత్సరంలోనే పెద్ద వుతుందేమో?"

"అవనీ? లోకంలో అందరూ కావ ంలా, అలాగే మన పిల్లానూ."

"అదిగాదండీ, పెద్దమనిషి కాకముందే పెండ్లిచెయ్యాలన్నా డన్నయ్య. లేకపోతే లుగురిలో తలవంపులట."

"మీ అన్నయ్య వచ్చినప్పుడల్లా ఏదో క బెడద తెచ్చిపెడుతూనే ఉంటాడు. రకరారు మహాత్ములన్నారులే. ఆయన కేం — చెపుతాడు. నా పరిస్థితిలో ఆయ నుంటే తెలిసొస్తుంది. ఇంకా ఏమన్నాడు?"

"మంచి సంబంధం అని చూచుకొం టుంటే కుదరదు. ఏదో ఒకటి చూసి ముడి పెట్టమన్నాడు."

"ఓహో ఎదుటివాళ్ళకి శ్రీరంగనీతులు ఎన్నయినా చెప్పొచ్చు. చూస్తాగా. రేపు తన కూతురి పెళ్ళి ఎలా చేస్తాడో. తన దగ్గరికి వచ్చేటప్పటికి గాని తెలీదులే."

"ఆయనన్నాడని కాదుగాని, ఎదిగిన పిల్లని ఎన్నాళ్ళని ఇంట్లో ఉంచుకొంటామండీ? నలుగురూ నవ్వరూ?"

"ఇంకేం బాగా తలకి పిచ్చి ఎక్కించి పోయ్యాడు. ఇక నన్ను వేధించుకు తింటావు."

అని భార్యమీద విసుక్కుంటూ రాజారావు భోజనం ముగించి లేచాడు.

రాజారావు కాళ్లు అరిగేటట్టు తిరిగి ఏదో సంబంధం కుదుర్చుకొని కూతురికి పెండ్లి చేసేడు. పెండ్లి అయ్యేటప్పటికి ఆయన చాలా బాధలు పడాల్సొచ్చింది. కాని సంఘానికి వెరచి ఎట్లాగో పెండ్లిఅయిందనిపించాడు.

* * *

అయిదు సంవత్సరాలు గడిచినయి.

సుందరమ్మ రామారావునిచూడటానికి వాళ్ళ యింటికి వెళ్ళింది.

రామారావు సుందరమ్మ మాట్లాడుకొంటుంటే రామారావు కూతురు పుష్ప, సుందరమ్మ దగ్గరకు వచ్చికూర్చున్నది.

"ఏమన్నయ్యా. పుష్ప కెప్పుడు పెళ్ళి చేస్తావు? ఇంకా రెండు మూడు నెలలలో పెద్దమనిషి అయ్యేటట్టుంది" అంది సుందరమ్మ.

పుష్ప సిగ్గుపడి నవ్వుకొంటూ లోపలికి వెళ్ళిపోయింది.

"ఆఁ ఇప్పుడేం తొందరలేవే, ఏదో ఫోర్తుఫారం చదువుకొంటున్నది. ఆ స్కూలు ఫయినలు కాస్తా అయిపోతే పెండ్లి చేసెయ్యొచ్చు. అదెంతసేపు పని?"

"అయితే అన్నయ్యా. పెద్దమనిషయినా ఇంట్లో పెట్టుకొంటావా? నలుగురూ యేమనుకొంటారు?"

"ఇంకా ఈ రోజుల్లో ఏమిటే. అయినా నలుగురూ అనుకొనిపోతారని మన పిల్ల చదువు మధ్యలో మానుకొంటామా?"

"అయితే సీత తండ్రి దాని కప్పుడే చదువు ఆపించి పెండ్లి చేసేడు గదా? ఆయనకన్న నీవేం ఎక్కువవాడివా?"

"అదేమిటే. ఆయన కూతురి పెళ్ళికీ, నా కూతురు పెళ్ళికీ సంబంధమేమిటి? ఆయన కిష్టమయింది. పెళ్లి చేసేడు. నా కిష్టమయినపుడు, నాకు సబబని తోచినపుడు నా కూతురికి పెండ్లి చేసుకుంటాను, ఊళ్ళోవాళ్ళెవరు మధ్య నన్నడగటానికి?"

"నలుగురితోపాటే మనమూ గదా అన్నయ్యా? ఊళ్ళో నలుగు రొకదారీ, నీవొక దారీనా?"

"అది కాదే సుందరం. నువ్వు లక్ష చెప్పు. పెళ్లిచేసేది నేనుగదా. వాళ్ళేమన్నా మనకి పీసమెత్తు సహాయం చేస్తారా? ఏమిటో లేవే, సంఘం, పరువు మర్యాదా అని పెట్టుకొంటే మనకి తూగద్దూ?"

"అంతే నంటావా అన్నయ్యా" అంది సుందరమ్మ, తన అన్నయ్య మారిపోయిన సిద్ధాంతాని కాశ్చర్యపోతూ.

ఇంకా అయిదు సంవత్సరాలు గడిచినయి. ఇప్పుడు పుష్ప కాలేజీలో చదువుతున్నది బియ్యే.

"ఏమన్నయ్యా, పుష్పకి పెండ్లిచేసే దేమన్నా ఉందా లేదా? నలుగురూ యేమనుకొంటున్నారో తెలుసా?"

"ఆఁ ఏమనుకొంటున్నారే? నా కూతురు చదువుకొంటుంటే వాళ్ళకేం? చూడలేని లోకం యేమయినా అంటుందిలే."

"వాళ్లనుకొంటున్నవన్నీ నీకేమని చెప్పమంటావన్నయ్యా. వినటానికి నాకే అసహ్యమేసింది. ఎందుకీ గొడవ? యెవ

# అరగంటకొక ఆత్మహత్య



"ది - వరల్డ్ - టుమారో" (రేపటి ప్రపంచము) అనే అమెరికనుపత్రికలో (1932 సం॥లో) ఆ పత్రికా సంపాదకుడు ఒక సంపాదకీయ వ్యాసంలో యిట్లు వ్రాసెను- అమెరికా సంయుక్త రాష్ట్రములందు 1931 సం॥ మొత్తము మీద 20 వేలమంది ఆత్మహత్య చేసికొని చనిపోయినారు. ఖూనీలు చేయబడటంవల్ల 12,000 వేల మంది మరణించారు. మోటార్లు వగైరాలక్రింద ప్రమాదవశంగా చనిపోయినవారు 35,000 మంది-ఈ లెక్కలను అమెరికాలో డా॥ ఫ్రెడరిక్కు యల్. హాఫ్‌మనుగారు సేకరించారు.

ఒక సంవత్సరానికి 365 రోజులు. రోజు 1కి 24 గంటల చొ॥ 365 రోజులకు 8,760 గంటలు లెక్క తేలినవి. గంటకు 2 అరగంటల చొ॥ 8,760 గంటలకు 17,520 అరగంటలు లెక్క తేలినవి. ఈ 17½ వేల అరగంటలలోను 20 వేల మంది ఆత్మహత్యల వల్ల మరణించారు. దీనిని బట్టి 26నిమిషములకొక ఆత్మహత్య చొప్పున జరుగుచున్నది- ఈ విషయమై హాఫ్‌మన్ గారు వ్యాఖ్యానిస్తూ యిలా వ్రాశారు-

జీవితము యొక్క పరమార్ధమును బోధపరిచేటటువంటి ఆత్మప్రబోధకరమైన పారమార్థిక చింతగాని ఆధ్యాత్మిక జిజ్ఞాసగాని ప్రజలకు లేకపోవుట వల్లనే జీవిత యాత్రలో సంభవించెడి విషాదములను జనులు భరించలేక ఆత్మహత్యలు చేసికొనుచున్నారు.

రెండవ ముఖ్యకారణం ఏదనగా జీవిత భోగసౌకర్యముల కొరకై ప్రజల దాహం ఎక్కువై జీవితంలో ఆత్మ సంతృప్తి అనేది ప్రజలకు కలుగక ఆత్మవిషాదం ఎక్కువవుతోంది.

మూడోముఖ్యకారణం ఏదనగా, వ్యాపారరంగం అంతా బ్రహ్మాండమైన పెట్టుబడిదారుల జూదమువలె జరుగుతోంది.

1931 సం॥లో అమెరికాలో 26,381 వ్యాపార సంస్థలు దివాలా తీసినవి. 400 కోట్లు డాలర్లు వెరశి మొత్తము గల బాకీలను యీ వ్యాపార సంస్థలు ఎగబెట్టినవి. అందువల్ల అనేక ఇతర అనుబంధ వ్యాపారసంస్థలు దివాలా తీశాయి. వేలకొలది జనుల నిల్వ ఆదాయ ద్రవ్యనాశనం అయింది. లక్షలకొలది జనులు నిరుద్యోగులైనారు. నిరాధారులై, నిరాశ చెందినవారు చాలామంది ఆత్మహత్యలు చేసికొన్నారు.

ధనికవర్గం చేతిలో ప్రజలు కీలుబొమ్మలైనారు. ఐహిక భోగముల ధ్యానతప్ప, ఆధ్యాత్మికచింత ప్రజలకు లేదు- అందువల్ల యీ నాగరికత ఆత్మనాశన హేతువుగా ఉంది.

ఒక ప్రఖ్యాత సినిమాతార ఒకనాటి వుదయం తనకు ప్రేక్షకలోకం వ్రాసిన వుత్తరాలను పరిశీలిస్తున్నది.

వేయికిమించి వున్న వుత్తరాలలో 999 యించుమించు అన్నీ ఒకే ధోరణిలో వున్నాయి.

కానీ-ఆ చివరి వుత్తరంలో మాత్రం యిలా వున్నది.

"మీరు యిటీవల నటించిన "..." చిత్రం నిన్నరాత్రి చూశాను. అందులో మీరు నవ్వినఆనవ్వు చాలా బాగుంది. కానీ, మీ నోట్లోవున్న పళ్లు అన్నీ పెట్టుడు పళ్లేనని తెలిసిపోతున్నది."

నరమానవు డెవ్వడూ కనిపెట్టలేని యీ రహస్యాన్ని కనిపెట్టిన యీఘనుడు ఎవరా అని ఆమె కొంచెం గాబరా పడింది. ఆ వుత్తరం వ్రాసినవారెవరో అని వుత్తరంఅంతా వెతికిచూసింది.

వుత్తరానికి పైభాగాన యిలా వున్నది.

డాక్టర్......

దంతవైద్యుడు.

# శ్రీరంగనీతులు

(7-వ పేజీ తరువాయి)

డికో చూసి చేసెయ్యగూడదూ?" అంది సుందరమ్మ.

"పెండ్లి అంటే అంత తేలికగావుందిటే. కట్టుకొన్న మొగుడితో జీవితాంతందాకా ఏడవాలంటే వరుణ్ణి ఎంత జాగ్రత్తగా యేరుకోవాలి. అన్నీ చూసుకోవాలి, చదువూ, డబ్బూ, అందం అన్నీ చూడకపోతే, పిల్లగొంతు కొయ్యటమేగా."

"అన్నీ కుదరాలంటే కష్టంకాదన్నయ్యా. అందులో ఇరవైయేళ్లొచ్చిన దాన్నెవరు చేసుకుంటారు. బెండకాయ ముదిరినా బ్రహ్మచారి ముదిరినా పనికిరాదన్నారు గదా?"

"అందుకని చూస్తూ చూస్తూ, దాని గొంతు కొరెయ్యమంటావుటే?"

"అని నే అన్నానా అన్నయ్యా. ఏదో మంచి సంబంధం చెయ్యాలన్నా కాని"

"ఇంతకీ పెళ్ళొచ్చినా, కళ్ళొచ్చినా ఆగదన్నారు. నువ్వు, నేనూ తొందరపడితే సరా?"

"అంతేలే అన్నయ్యా" అంది సుందరమ్మ వెటకారంగా—హడావుడిగా, బలవంతంమీద జరిగిన తన కూతురి పెండ్లి తలచుకొంటూ. ★

# కాలక్షేపం

(5-వ పేజీ తరువాయి)

యీసంసారమనే మట్టిబురదకంటె, ఉన్నతమైన జీవిత ఆదర్శములు, నక్షత్రాలవలె, తారలవలె కన్పించాయి. భారతభూమిలోని కర్మయోగులకు ఆ తారకమార్గం ఆకాశవీధిలో కన్పించడమే కాదు. ఆదర్శమాత్రమే కాకుండా ఆ తారకమార్గం వారికి కరతలామలకమై అనుభవైకవేద్యమై ప్రత్యక్షప్రమాణమైంది.

ఇటువంటి కర్మభూమిలో ఆధ్యాత్మిక ప్రమేయంలేనట్టి జీవితవ్యాపారంగాని కర్మగాని ఉండడం అసంభవం. *"I have come to spiritualize politics"* (రాజకీయరంగాన్ని ఆధ్యాత్మిక తత్వనిమగ్నం చేయడానికి నేను వచ్చాను)అని గాంధి మహాత్ముడు తన సత్యాగ్రహ ఉద్యమం ప్రారంభించక పూర్వము నాగపూరు కాంగ్రెసు సభలో ఉపన్యసిస్తూ అన్నాడు. ఆయన సాధించిన స్వరాజ్యం "హర్తాళ్"తో (హరితాళ్ =హరిభజనతో) ఉపవాసాలతో, భగవత్ప్రార్థనలతో, ఆత్మబలంతో సాధించాడు. ఆయన సాధించినదిగాని, ఆయన సంకల్పించినదిగాని *"Secular Government"* భౌతికరాజ్యం కాదు. రాజకీయస్వాతంత్ర్యం,—దాని మూలంగా ఆర్థికస్వాతంత్ర్యం, ఆధ్యాత్మిక స్వాతంత్ర్యం సాధించాలని ఆయన "రఘుపతి రాఘవ రాజారాం! పతితపావన సీతారాం! ఈశ్వర అల్లా తేరేనాం! సబ్ కో సన్మతి దే భగవాన్" అని జపించి మననం చేశాడు.

వేలకొలది సత్యాగ్రహులు ఆయన అడుగుజాడల నడచి, లాఠీదెబ్బలు తిని, జెయిళ్లకువెళ్లి, కృశించి, ప్రాణాలర్పించినది దేనికోసం? భౌతికరాజ్యంకోసం కాదు. బంగారు నాగళ్లతో భూమిని దున్నడం జిల్లేడుదూది పండించడం కొరకా? మంచి గంధపుచెక్కలను కాల్చి నవరత్నఖచిత పాత్రలో మనము వండినది తెలక పిండియేనా?

కమ్యూనిస్టులు కోరేదికూడా ఆర్థికస్వాతంత్ర్యమే. కాని ఈ కర్మభూమిలో అంతకంటె ఎక్కువైన ఆత్మస్వాతంత్ర్యం పెరిగి పెంపొందాలి. అదే మనకు మహర్షులిచ్చిన విభూతి. అట్టి మహాత్ముల భస్మరాసులతో పవిత్రమైన భారతభూమి ఇది దీనికి మించిన దేశమింకొకటి లేదు.

"యతుల విభూతి దాల్తు విల-
సమ్మరో! నీసరి ధన్యలుందురే!"
మహాత్మా గాంధీకీ జై!
భారతమాతకీ జై! ★

## కీ. శే. యస్. జి. ఆచార్యగారు

ఆంధ్ర దేశానికి చిరపరిచితులు, సుప్రసిద్ధ పత్రికా రచయిత అయిన శ్రీ యస్. జి. ఆచార్యగారి అకాల మృతి వల్ల సంసారమ్ వ్యాసావళి నిలిపివేయ వలసి వచ్చినదని మా పాఠకులకు తెలియ పరచుటకు చింతించు చున్నాము. తెనుగు పత్రికా ప్రపంచానికి శ్రీ ఆచార్యగారు చేసిన సేవ అమూల్య మైనది. పత్రికా రచనకు జీవితాన్ని అంకితం చేసిన శ్రీ ఆచార్యగారి ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థించు చున్నాము. సం.



తిరుమలలోని ఆలయం —ఎస్. సర్దార్ గారి తైలవర్ణ చిత్రం.

ఆకాశపుటంచు —పి. బి. సురేంద్రనాథ్ గారి తైలవర్ణ చిత్రం.

## చిత్రకళా ప్రదర్శన సమీక్ష :

# అభ్యుదయ చిత్రకారుల సంఘ వార్షిక ప్రదర్శనం

వి. ఎస్.

ప్రోగ్రెసివ్ పెయింటర్స్ ఎసోసియేషన్ (మద్రాసు) వారి తొమ్మిదవ వార్షిక చిత్రకళా ప్రదర్శనం స్కూల్ ఆఫ్ ఆర్ట్సు భవనంలో యీ 8 నుంచి ఆరంభమైంది. ప్రదర్శనాన్ని మద్రాసు ముఖ్యమంత్రి రాజగోపాలాచారి గారు ప్రారంభింప చేశారు.

ప్రదర్శనంలో 332 చిత్రాలు వున్నాయి ఈ చిత్రాల నన్నిటినీ తీరికగా పరిశీలించినమీదట నాకు తోచిన అభిప్రాయాలు స్థూలంగా యివి; వీటిలో హెచ్చుభాగం చిత్రాలు గడిచిన ఏడాదిలో మరి ఏ ప్రదర్శనంలోనూ చూచినవి కావు అంటే యివన్నీ యీ ఏడాదివ్యవధిలోనూ తయారైనవే ఐవుండాలి. ఒక్క ఏడాదిలోగా స్కూల్ ఆఫ్ ఆర్ట్సు, దానికి సంబంధించిన వ్యక్తుల ప్రోత్సాహంవల్ల ప్రదర్శన యోగ్యమైన యిన్ని చిత్రాలు తయారు కావటమన్నది నిజంగా సంతోషించవలసిన విషయం. నాలుగైదు ఏళ్ళక్రితంవరకూ కానరానంతటి వుత్సాహం యీ చిత్రకారులలో యిప్పుడు కనిపిస్తున్నది. కనుకనే ఒక్కొక్కరు యింత అల్పవ్యవధిలో యిన్ని చిత్రాలు వ్రాయగలిగారు. ఇన్ని చిత్రాలు తయారు చేయటానికి కావలసిన ఆర్థిక పరిస్థితులు ఈ చిత్రకారులకు క్రొత్తగా అనుకూలించాయనుకోవటానికి తగినంత కారణం కనిపించటం లేదు. అయినా యిన్ని చిత్రాలు యీ ఒక్క పట్టణంలోని చిత్రకారులు తయారుచేసి ప్రదర్శనానికి పంపించారంటే, అందుకు ముఖ్యమైన కారణం ఆ చిత్రకారుల మనస్సులోనే వున్నదికానీ, యితరత్రా వారి నెవ్వరూ పోషించి ప్రోత్సహించలేదు. ఈమాదిరి వుత్సాహం చిత్రకారులలో తరిగిపోకుండా వుంటే అనతికాలంలో చిత్రకళ చాలా ప్రముఖ స్థానాన్ని అందుకోగలదనటానికి సందేహం లేదు.

ప్రదర్శనం చూడటానికి వస్తున్న జన బాహుళ్యాన్నీ, అమ్ముడవుతున్న బొమ్మల సంఖ్యనుబట్టీ చూసినా కూడా, చిత్రకళ యిటీవల ప్రజాదరణను పొందుతున్నదనీ, ముందుముందు చిత్రకారుల పరిస్థితి బాగుపడడానికి అవకాశాలు వున్నాయనీ అనిపిస్తున్నది.

చిత్రరచనాశైలిలో కూడా చిత్రకారులు అనేక బాణీలను అభిమానిస్తున్నారు. తైలవర్ణాలు, నీటిరంగులు, 'టెంపరా', 'చాక్' మొదలైన అన్ని వర్ణ సాధనాల లోనూ యీ చిత్రకారులు ప్రయోగాలు చేస్తున్నారు. కొందరు కొందరు మెచ్చదగిన ఫలితాలను కూడా పొందగలిగారు. బాణీల విషయంలో కూడా నేటివరకు ప్రపంచదేశాలన్నిటిలో ఎప్పుడో ఒకప్పుడు ప్రచారంలోకి వచ్చిన అన్ని తరహాలను ఈ చిత్రకారులు అనుకరిస్తున్నారు. ప్రాచీన హైందవ చిత్రకళారీతుల్లో ధనపాల్ గారు, హైందవ జానపద చిత్రకళా రీతిలో కె. శ్రీనివాసులు, పిలకా లక్ష్మీనరసింహామూర్తి, సి. ఎల్. మణిగార్లు, బైజెన్టైన్ పద్ధతిలో పి. ఆర్. రామచంద్రరావుగారు, పోస్టు యింప్రెషనిస్టు, యింప్రెషనిస్టు పద్ధతులలో కె. సి. ఎస్. పణికర్, హెచ్. వి. రామగోపాల్ గార్లు ప్రశంసార్హమైన చిత్రాలు కొన్నిటిని చిత్రించారు.

కొందరు చిత్రకారులు కేవలమూ ప్రకృతి దృశ్యాలనో, కేవలమూ గుళ్లూ గోపురాలనో అభిమానించి వాటిని పలు భంగుల చిత్రించారు. జి. డి. త్యాగరాజన్ గారు ఎక్కువగా మర్రిచెట్లు, బోదెలను చిత్రించారు. దేవాలయ అంతర్భాగ దృశ్యాన్ని కూడా ఒకటి చిత్రించారు. వీరి చిత్రాలలోనూ, ప్రదర్శనంలో వున్న మరికొందరి ప్రకృతి దృశ్యాలలోనూకూడా ప్రఖ్యాత ప్రకృతి దృశ్య చిత్రకారుడు జి. డి. పాల్ రాజు గారి (మద్రాసు) పోకడలే బలంగా కనిపిస్తున్నాయి. కె. రామమూర్తి గారుకూడా హెచ్చుభాగం ప్రకృతిదృశ్యాలనే ప్రదర్శించినా, ఆయన బాణీ కొంతమటుకు ప్రత్యేకంగా వున్నది. ఆర్. కృష్ణరావుగారు గుళ్లూ, గోపురాలు వీధులు ఎక్కువగా చిత్రించారు. ఈయన ఏర్పరచుకొన్న శైలి ఫలితంగా, వీరి చిత్రాలు ఎక్కడవున్నా యిట్టే గుర్తించదగినంత ప్రస్ఫుటంగా వుంటాయి.

తైలవర్ణ చిత్రణంలో కె. సి. యస్. పణికర్ గారు సాహసోపేతమైన కొని

౨



# చిత్రకళా ప్రదర్శన సమీక్ష

ప్రయోగాలు చేశారు. ఈ ఏడాది ఆయన ప్రదర్శించిన చిత్రాలు అన్నిటిలోనూ, ఆయన, కళ్లు మిరుమిట్లు గొల్పేటంత వర్ణని రంగులనే వాడి, వాటితోనే హృద్యమైన ఒక అనుభూతి వచ్చేలా చిత్రాలను చిత్రించారు. ఈ ప్రోగ్రెసివ్ పెయిన్టర్స్‌వారు ఏటేటా ఏర్పాటుచేస్తున్న ప్రదర్శనాలలో వేటినీ విడవకుండా చూస్తూవున్న కారణంచేత, నాకు, కె. సి. ఎస్. పణికర్ గారి విషయంలో ఒక అభిప్రాయం ఏర్పడుతున్నది. ఈయన ఒకసారి వుపయోగించిన పద్ధతిని మరొకసారి వాడకుండా ఏటేటా చిత్రరచనాపద్ధతిలో ఏవేవో మార్పులు చేస్తూనే వున్నారు. ఈయన తెచ్చిన ప్రతి మార్పునీ యువక చిత్రకారులు ఎందరో అనుకరిస్తున్నారు. ఈ ఏడు ఆయన తెచ్చిన మార్పు వర్ణని రంగులు వాడకంలోనే.

వ్యాసం ముగించేలోగా ఎల్. మునుస్వామిగారు నిలువుగీతల ఆధారంతో చిత్రించిన 'కూవమ్ నదిపై నావ'ల చిత్రాన్నీ, సంతాన రాజ్ గారి తైలవర్ణ చిత్రాలను, భాగేశ్వర శర్మగారి 'మందార పుష్పాలు' చిత్రాన్నీ, కె. ఎమ్. గోపాల్ గారి 'శిలువ' చిత్రాన్నీ, వి. బి. ఆర్. మూర్తిగారి 'మహిషాసుర మర్దని' రేఖా చిత్రాన్నీ, పి. వి. జానకిరామ్‌గారి 'జీర్ణ గృహం' చిత్రాన్నీ అభినందిస్తున్నాను. ప్రదర్శనకోసం చేసిన ఏర్పాట్లుకూడా బాగున్నాయి.

—వి. ఎస్.

**యౌవనశ్రీ**

—వి. రామమూర్తిగారు రచించిన టెంపరా చిత్రం.

---

ఒక రైతు పొలంలో ఆ ఏడు పుచ్చకాయలు విపరీతంగా కాశాయి. అంత కాపు కాసినందుకా రైతు ఏంతో సంతోషిస్తున్నాడు. తీగా అవి పండటం మొదలయ్యేసరికి ప్రతిరోజూ పొలానికి వెళ్లి చూసుకొంటే 4, 5 కాయలదాకా ఎవరో కోసుకు పోతున్నట్లు బయట పడింది. ఒకరాత్రి రాత్రంతా పొలానికి కాపలా కాశాడు. అప్పటికీ పుచ్చకాయల దొంగతనం జరుగనే జరిగింది. ఇక యిల్లా లాభం లేదని ఒక పెద్ద అట్టమీద "ఈపొలంలో కాసిన పుచ్చపళ్లల్లో ఒకటి విషపుది. జాగ్రత్త" అని వ్రాయించి, పొలంలో నట్టనడాన వెదురు పాతించి దానికి యీ అట్టను తగిలించి, ఆరాత్రి నిశ్చింతగా యింటికిపోయి పడుకొన్నాడు.

మర్నాడుదయమే పొలానికి వచ్చి చూస్తే ఆ అట్టమీదే "ఈ పళ్లల్లో విషపు పుచ్చెలు ఒకటి కాదు; రెండు!!" అని వ్రాసివుంది.

# అతకని బతుకులు

— పెద్దకథ —

"నడింపల్లి"

## 12

లోకమే ఒక తీరు దానిని వ్యతిరేకించిన అభిప్రాయాలూ, ఇష్టాలూ నేలమట్టం గాక మానవు. ముక్కుకు సూటిగా పడుచుకోక హృదయమనీ, గిదయమనీ అంగలార్చే వ్యక్తులకు చివరకు మిగిలేది, చితికిపోయిన బ్రతుకుమాత్రమే.

రాత్రి భోజనమైంతర్వాత వరాండాలో కూచుని సిగరెట్టు వెలిగించాను. నాన్న వచ్చి చేతులు తుడుచుకుంటూ, "ఇల్లు గుర్తు దొరికిందా? — చాలసేపు వెదికారా?" అన్నారు.

"ఎందుకు? నీ విచ్చిన అడ్రసుందిగా?" అన్నాను, కొద్దిగా నవ్వి.

"పిల్ల ఎట్లా ఉంది?" అన్నాడు, నా పక్కనే కుర్చీలో కూర్చుంటూ.

"బాగానే ఉన్నది" అన్నాను. నాన్న కొద్దిగా నవ్వి ఊరుకున్నాడు.

"కాని - నాకు నచ్చలేదు" అని గొణిగాను.

"విడిశావులే" అన్నాడు నాన్న, ఏదో ధ్వనిస్తూ. నేను మెదలకుండా సిగరెట్టు కాలుస్తున్నాను.

"ఒరే—నచ్చట మంటే ఎక్కడికి అంతు? ఏదో సాంప్రదాయం చూసి చేసుకోవాలి గాని" అన్నాడు నాన్న, కాసేపుండి.

నేను మాట్లాళ్ళేదు.

"అయినా, పిల్ల బాగానే ఉన్నదంటివి ఇక నచ్చకపోవట మేమిట్రా?" అన్నాడు, నన్ను మందలిస్తూ.

పిల్లెవరికీ అర్థంకానిదే అది. ఒక్కమాటు 'పెళ్ళికూతురు' మనస్సులో మెదిలింది. చక్కని శిల్పి తయారుచేసిన చందనపు బొమ్మలా ఉంది; కాని నా హృదయ తంత్రుల్ని కదిలించి గానంచేసే శక్తి ఆమెకు లేదు.

నేను మాట్లాళ్ళేదు.

"నేనూ చూశానులే - నీవు వెయ్యి జన్మలెత్తితేమాత్రం అటువంటి పిల్ల నీకు దొరుకుతుందట్రా?" అన్నాడు నాన్న, నాకు నచ్చచెబుతూ.

శకుంతల కళ్ళల్లో మెదిలింది; సిగరెట్టువతిల పారేశాను.

"బాగా ఆలోచించుకో - ఏ మాటా వాళ్ళకి తొందర్లో చెబితే, వాళ్ళింకో చోట చూసుకుంటారు" అని నాన్న లోపలికి వెళ్ళిపోయినాడు; మాటల్లో కోపం కనబడ్తూనే ఉంది.

నేను రెండో సిగరెట్టు వెలిగించి, ఆలోచిస్తూ కూర్చున్నాను.

ఈ బాధపడలేకనే ప్రపంచానికి దూరంగా పారిపోయినాను కాని మళ్ళీ విధి నన్నీ కూపంలోకి యీడ్చుకొచ్చింది. కళ్ళెత్తి చూశాను; వీధిలో దీపాలు చలికి ఒణుకుతున్నై.

కాస్త నా 'భావి'లోకి ఆలోచనలు పొడిగించాను. అంతా అంధకారమే కనిపించింది. ఎదురుగా యీ రభస జరుగుతున్నంత కాలం మనశ్శాంతి ఉండనే ఉండదు; మళ్ళీ పారిపోదామా అనిపించింది మనస్సులో తాయి వెక్కిరించింది. కళ్ళు గట్టిగా మూసుకున్నాను; చలిగాలి ఎక్కువైంది.

## 13

లోపలికి వెళ్ళి, మంచంమీద పక్క వేసుకుని పడుకున్నాను—

ఈ లోకంలో ఎవరు ఎవరికోసం పుట్టారనేది చిక్కు విషయం. సముద్రపుటుప్పూ, అడివి ఉసిరి కలిసినట్టు ఎక్కణ్ణుంచో కొట్టుకొచ్చి జతపడ్డ జీవితాలు ఏకమైపోవలిసిందే! జన్మఎత్తిన తర్వాత వివాహం ఒక ఉల్లంఘించరాని ఆచారమైపోయింది; తిరగబడ్డవాడందరికీ వెగటే అయిపోతాడు.

ఎదురుగుండా గోడమీద పక్కగదిలో వెలుగుతున్న దీపపుకాంతి పడ్తున్నది: నా తలలో ఆవేదన సుళులు తిరుగుతున్నది.

పరిపడని సంగతుల్ని స్మరించేకొద్దీ బుర్ర వేడెక్కి మనస్సు చెడిపోవటంతప్ప, ప్రయోజనం లేదు. శకుంతల శాశ్వతంగా పరాయిది; అదంతా ఓనాటి ఘట్టం శకుంతల్ని మరిచిపోవటమే మంచిదనిపించింది. శకుంతల నా జీవితంలో చెయ్యవలసిన నాట్యం ఇంకో వ్యక్తి పాలబడక తప్పదు. శకుంతల్ని గురించి మథనపడేకంటె, నా జీవిత భాగస్వామినిగా వేరే వ్యక్తిని తీసుకోవటమే కర్తవ్యమనిపించింది.

ముసుగుదన్ని కళ్ళు గట్టిగా మూసుకున్నాను. కు తెలీకుండానే కళ్ళు అశ్రుపూరితాలై, కన్నీళ్ళు బొటబొట కారినై.

నా జీవితాకాశంలో ఉదయించబోతున్న చంద్రిక ఎటువంటి దౌతుంది? నా హృదయ తంత్రులు కదిలినై; అయితే తీయని స్వరం మాత్రం వినబళ్ళేదు.

శకుంతల ఎటువంటిది? - నిర్ధారించుకోలేకపోయినాను. చివరికి, నన్ను కదిలించివేసే అమాయకురాలు దొరికిందాకా, వివాహం చేసుకోకూడదని నిశ్చయించుకున్నాను గోడమీది గడియారం అరగంట కొట్టింది.

తెల్లవారి నిద్రలేచేసరికి మామయ్య, నాన్నతో మాట్లాడుతున్నాడు. నేను వరాండాలోకి వచ్చి, చలికి వణుకుతూ, దుప్పటి కప్పుకుని కుర్చీలో కూర్చున్నాను, ముడుచుకుని. అమ్మ లోపల ఎక్కడో పని చూసుకుంటున్నది

నాన్న అంటున్నాడు: "ఏమోరా - వాడెవరిమాటా వినేట్టు లేడు" అని. మామయ్య నవ్వి ఊరుకున్నాడు, ముఖం పుల్లనముల్తూ.

నీళ్ళతో ముఖం కడుక్కుని, "నేనూ పెద్దవాణ్ణైపోతున్నానా? - ఏదో వాడినొక ఇంటివాణ్ణి చేస్తే నాకూ దిగులుండదు" అన్నాడు నాన్న, ముఖం తువ్వాల్తో తుడుచుకుంటూ. నాకు ఏడుపొచ్చింది.

మామయ్య నవ్వి. "అట్లాగే అంటాడులే, బావా; నీ కెందుకు, నీపని నీవు కానీ" అన్నాడు; నేను నవ్వుకున్నాను.

నాన్న మాట్లాళ్ళేదు.

"లేకపోతే ఇంటి చాకిరీ అంతా అక్కయ్యమాత్రం ఒక్కతే ఏం నెట్టుకురాగల్గుతుంది, యీ పెద్దతనంలో?" అన్నాడు మామయ్య కాసేపుండి.

నాన్న ఆమోద పురస్సరంగా చప్పరించి కుర్చీలో కూర్చున్నాడు.

మామయ్య గట్టిగా పళ్లు తోముతున్నాడు; నేను నిట్టూర్చి, కుర్చీలోంచి లేచాను దంతధావనానికి.

కోడలంటే ఇంటికి చాకిరీ చెయ్యటానికి సంఘం అర్పిస్తున్న బానిస. ఆర్థికంగా తలఎత్తలేని భారతదేశంలో ఆచారం చేస్తున్న ఉపకారం ఆడదాన్ని సతీమణిని చెయ్యటం; పురుషుడికి స్త్రీనుండి లభింపవలిసింది వట్టి చాకిరీతప్ప ఇంకేమీ లేదా అనిపించింది. అక్షరంముక్క నేర్చుకోటానికి గూడా నోచుకోని యీ వాజమ్మలు




# అతకని బతుకులు

పురుషకారానికి తమ మట్టిబొమ్మల్నప్పగించి, ముళుగ్గుంటల్లోని పురుగుల్లా దాటిపోవలసిందేనా, అని విసిగిపోయినాను.

మనది మనస్సుకు పట్టని ఆధ్యాత్మికం. జీవితకలాపంలో హృదయాన్నంటని రాగాలాపాలు మన బ్రతుకులు. ఇవి కాన్ని దాటి ఆముష్మికంగా పురుషుణ్ణి కదిలించివెయ్యగల శక్తి స్త్రీకి లేదా అని తర్కించుకున్నాను.

కాఫీ తాగి బజారుకు బైలుదేరాను. మంచు విడిపోయి, సూర్యుడు బాగా కనబడ్తున్నాడు. అనవసరంగా కాలేజీకి సెలవుపెట్టి కాలం పాడుచేసుకోవటం శుద్ధ దండగనిపించింది. మిగిలిన సెలవు కేన్సెల్ చేయించుకొని, మళ్లీ ఉద్యోగంలో చేరటానికి నిశ్చయించుకొన్నాను.

"ఆనక బండీకి గుంటూరు వెళ్తున్నానమ్మా" అన్నాను, బజారునుంచి ఇంటికి తిరిగిపోగానే.

"అదేమిట్రా – ఉన్నవాడి పెట్లాగూ ఉండనేఉన్నావు; ముందు పుచ్చుకుని పో" అన్నది అమ్మ. నేను నవ్వి, "నాకెందుకు మందు?" అన్నాను.

"మరి సెలవెందుకు పెట్టినట్టు?" అన్నది.

"తోచక" అన్నాను విసుక్కుంటూ. అమ్మ మాట్లాళ్లేదు.

కాసేపుండి, "నా కెందుకులే – నీ ఇష్టమొచ్చిన ట్లఘోరించుకో" అన్నది. నేను మాట్లాడకుండా ప్రయాణానికి సిద్ధపడ్డాను.

"ఆయన మళ్లీ వస్తాడు – ఏం చెప్పమంటావు?" అన్నది అమ్మ, నాకు అన్నం వడ్డిస్తూ.

"ఎవరు?" అన్నాను, ఎవరో తెలిసికూడా.

అమ్మ కాసేపు నా తెలివితక్కువకి నిరసనగా మౌనవ్రతం అవలంబించింది.

"పిల్ల నీ కిష్టమేనా?" అన్నది కాసేపటికి మళ్ళీ.

"నేను పెళ్ళిచేసుకోను" అన్నాను మెల్లిగా.

"చేసుకోకు" అన్నది కోపంగా. కాసేపుండి నెయ్యంతా విస్తట్లో గుమ్మరిస్తూ, "ఎంతకాలంరా, యీ ఘోటకబ్రహ్మచర్యం?" అన్నది బణికే కంఠంతో. నేను కళ్ళెత్తి చూశాను; అమ్మకళ్ళల్లో నీళ్లు తిరిగినై.

"నేనేమో రోగిష్టిమారిదాన్ని; ఎప్పుడు దాటిపోతానో నాకే తెలీకపాయె. కాస్త ఒక్క కొడుకు పెళ్ళో అన్నా జంధ్యపు పోచ పడితే చూద్దామనుకుంటే, నాకు



"మన శాంతవాళ్ల నాన్న గారితోపాటు ఎయిరోడ్రోముకు వెళ్ళివచ్చినట్లుంది"

అదీ ప్రాప్తంలేదు; పాపిష్టిదాన్ని" అన్నది కన్నీళ్ళు తుడుచుకుంటూ; నాకు మెతుకు మింగుడు పళ్లేదు.

"నాకా పిల్ల నచ్చలేదు" అన్నాను తప్పించుకోటానికి.

"నీకు ఏపిల్లా నచ్చదులే" అన్నది కోపంగా. నేను మజ్జిగన్నం కలుపుకుంటున్నాను.

"ఆ పిల్లకేంరా, నిక్షేపంలాగుంటే? ఇంటికొచ్చిన ప్రతిసంబంధం వెళ్ళగొట్టటం తప్ప–" అన్నది.

"నీకు నిక్షేపంలాగుంటే, నాకు కోరివిలా ఉంది" అన్నాను కసిగా.

"రామ రామ – నీవు చేసుకోకపోతే మానెగాని, నిష్కారణంగా ఆ పిల్లని అట్లా అనకు; పాపం!" అన్నది కోప్పడుతూ.

నేను మాట్లాళ్ళేదు; చెయ్యి కడుక్కోటానికని లేచాను.

వరండాలో కూర్చుని సిగరెట్టు వెలిగించుకుంటుండగా, నాన్న ఎక్కణ్ణుంచో వచ్చి లోపలికి వెళ్ళాడు. నేను వెనకనే వెళ్ళి, "గుంటూరు వెళ్తున్నా, నాన్నా" అన్నాను.

"సెలవు పెట్టానంటివిగా?" అన్నాడు నాన్న, చొక్కా విడుస్తూ.

"మిగిలిన సెలవు కాన్సెల్ చేయించుకుంటా" అన్నాను.

నాన్న మాట్లాళ్ళేదు. నేను అక్కణ్ణుంచి బైలుదేరి మామయ్యగారింటికి వెళ్లాను. వాకిట్లో శకుంతల నన్ను చూసి

పక్కకి ఒదిగి వెళ్ళిపోయింది. మామయ్య లోపల భోజనం చేస్తున్నాడు; నేను వెళ్ళి గడపలో కూర్చున్నాను.

"ఆనక గుంటూరు వెళ్తున్నా, మామయ్యా" అన్నాను.

"ఏం తొందర - సెలవు పెడితివిగా?" అన్నాడు.

"అయినా వెళ్తాను" అన్నాను.

మామయ్య భోజనం కానిచ్చి వాకిట్లోకి వచ్చాడు; ఇద్దరం బల్లమీద కూర్చున్నాం. మామయ్య తను తెచ్చుకున్న చుట్ట సరిచేస్తూ, "పెళ్ళి చేసుకోనంటావు శేం ఖర్మం రా?" అన్నాడు మందలిస్తూ.

నేను మాట్లాళ్ళేదు; సిగరెట్టు వెలిగించాను.

"మాట్లాడవేంరా?" అన్నాడు, చుట్ట నోట్లో పెట్టుకుని.

నేను యీ తడవగూడ మాట్లాళ్ళేదు.

"అయినా, నీ తలకాయ, ఇంకా ఎంత కాలం పెళ్ళి లేకుండా ఉంటావురా? ఏదో ఓ బ్రతుకుతెరువు చూసుకుంటివి; పెళ్ళిగూడ కానిచ్చేసుకుని ఒకచోట స్థిరపడిపోతే సరిపోయిందిగాని, ఎంతకాలం యీ కటికి బ్రతుకు?" అన్నాడు, హితబోధ చేస్తూ.

నేను మెదలకుండా సిగరెట్టు కాలుస్తున్నాను.

మామయ్య నావేపు చూస్తూ, "ఏదో కాస్త ఇంటిపట్టున నాలుగు మెతుకులు పడితే సరిపోయింది గాని, ఎంతకాలం హోటల్లో ఆ దరిద్రపు కూడు తింటావు - రోగం రాదూ?" అన్నాడు. నా హృదయంలో మూలుగులు వినిపించినై.

## 14

"నాకు పెళ్ళి చేసుకోవాలని లేదు, మామయ్యా" అన్నాను, చివరికి ధైర్యం చేసి. మామయ్య నవ్వి ఊరుకున్నాడు, చుట్ట పొగ గుప్పున వదిలి.

"ఏ జన్మలో చేసుకున్న కర్మఫలమో, మళ్ళీ పుట్టి హృదయాన్ని దహించేశాను పుట్టినందుకు యీ లోకంలో నే తీర్చవలిసిన ఋణాలు బోలెడన్ని ఉన్నై. ఈ బంధాలు చాలనట్టు మళ్ళీ ఇంకో అనుబంధమెందుకు, మామయ్యా?" అన్నాను, ఆవేశంతోటి.

మామయ్య చుట్ట కాల్చటంలో మగ్నుడై మాట్లాళ్ళేదు.

"అందరిలాగా యీ ప్రవాహంలో బడి కొట్టుకుపోకుండా, తరణోపాయం వెదుక్కుందామని ఉన్నది" అన్నాను.

మామయ్య నవ్వి, కాసేపు మెదలకుండా ఊరుకున్నాడు.

"ఒరే, యీ పిచ్చికూతలకేం గాని, మీ



# అతకని బతుకులు



నాన్నా, అమ్మ చెప్పినట్టు విను;" అన్నాడు, ఉన్నట్టుండి; నా గుండెలు జారిపోయినై.

"మహా మహా మునీశ్వరులంతటి వాళ్ళకి నిగ్రహం లేకపోయింది. రోజుకు అర డజను మార్లు కాఫీ హోటళ్ళూ, నాలుగు పెట్టెల సిగరెట్లు రుచి చూసేవాడివి, నీకా నిగ్రహం ఎక్కణ్ణుంచి వస్తుందిరా? అన్నీ ఉడిగిపోయిన మా అంతటి వాళ్ళం, చాపల్యం చావక పిసుక్కు చస్తుంటే, నీవేమిటి మహా కబుర్లు దంచుతున్నావ్?" అన్నాడు మామయ్య చివాట్లేస్తూ.

నేను మాట్లాళ్ళేదు.

"ఇప్పుడట్లాగే ఉంటుంది; తర్వాత అఘోరిస్తావ్?" అన్నాడు మామయ్య, నొక్కి పలుకుతూ.

"అయినా, కుర్రవాడివి; నీకెందుకదంతా? - మీ అమ్మ, నాయనా చెప్పినట్టు విని పెళ్లిచేసుకో, తరణోపాయం అదే దొరుకుతుంది" అన్నాడు, ఆఖరి మాటగా. నేనేమీ మాట్లాళ్ళేదు.

కాసేపుండి, "మీ నాయన పనీ అయిపోయింది. కొత్త వాళ్ళ కాధారంగా ఉండటానికి బదులు బైరాగుల్లో కలిసి పోతానంటే ఎట్లారా?" అన్నాడు, బతిమాలుకుంటున్నట్టు.






నేను కొద్దిగా నవ్వి, సిగరెట్టు వెలిగించాను.

"వెనకంటే, చదువు పూర్తిగా వాలన్నావు, బావుంది. ఏదో వివాహం చేసుకుని, ఒకచోట స్థిరపడితే సరిపోయింది గాని, ఎల్లకాలం మీ అమ్మ నాయన మీదే బరువంతా మోపితే ఎట్లారా?" అన్నాడు, తిరిగి.

నేను సిగరెట్టు చివర బూడిద రాలుస్తున్నాను.

"నా మాట విని తొందరగా పెళ్ళి చేసుకో. అప్పుడీ సన్యాసం, గిన్యాసం మెదడులోకి జొరబడవు" అన్నాడు మామయ్య, ఆఖరికి.

నేను నిట్టూర్పు విడిచి ఊరుకున్నాను; ఎవరిని పెళ్లి చేసుకునేది?

మామయ్య చుట్ట ఆర్పేస్తూ, విషయం మార్చేసి, "అయితే ఏ బండీకి వెళ్తావురా?" అన్నాడు; చెప్పాను.

ఇంటికి తిరిగి వచ్చాను.

నేను బండీ ఎక్కబోతుండగా, "ఏం రాయమంటావురా?" అన్నాడు నాన్న.

జీవితంలో ఏదీ తప్పేది లేదు; నా సౌఖ్యం లేకపోయిం తర్వాత ఎదుటివాళ్ళ ఆనందానికన్నా సరేననటం మంచిదనిపించింది.

నేను సిగరెట్టు వెలిగిస్తూ మాట్లాళ్ళేదు రైలు ఇంజను కూత కూసింది.

"నిన్నేరా, - ఆయనకేం రాయమంటావు?" అని హెచ్చరించాడు నాన్న.

"మీ యిష్టం" అన్నాను; బండీ బైలుదేరింది. నాన్న ఆనందంగా చెయ్యూపి, వీడ్కోలిచ్చాడు. నేను కిటికీలోంచి బైటికి చూస్తున్నాను, వెనక్కి తిరిగిపోతున్న ప్రపంచంవంక.

రైల్లో జనం పల్చగా ఉన్నారు. నేనో మూల కూర్చున్నాను, మనుష్యుల్ని చూస్తూ.

పుట్టిన తర్వాత విధిగా నిర్వర్తించవలిసిన పనులున్నై, ప్రతి ఒక్కరికీ; ఇది సౌఖ్యానికి మానవులు నిర్మించుకున్న ఆచారం కాదు - గుడ్డిగా అనుసరిస్తున్న త్రోవ. బాల్యచాపల్యంలో శరీరం మరిచి గంతులేసిన ప్రాణి, యౌవనదశలో వ్యామోహంలో పడి, క్షణికానందంకోసం చేసిన పొరబాట్లకి యావజ్జీవితం కృంగిపోతుంది; ఆఖరు దినాల్లో, తను చేసిన తప్పులకి విచారించి, దాటిపోతుంది. ఇది ప్రతి ఒక్కడికీ తెలిసిన సత్యం; కాని అంత్యకాలం ఆస

న్నమైన్నప్పుడే తప్ప ముందుగా ఇది తెలుసుకుని జాగ్రత్త పడాలనుకుంటే యావత్సంఘం నిరోధించి తీర్తుంది.

రైలు జోరుగా పరుగెత్తుతున్నది; సిగరెట్టు తీసి వెలిగించాను, ఎదురు బెంచీమీద తల్లి ఒళ్లో ఆడుకుంటున్న పసిపాపని చూస్తూ.

గుంటూరుస్టేషన్లో రైలాగేసరికి కనిచీకటి పడ్డది; సన్నని చలిగాలి ఆరంభమైంది. సరాసరి 'రూము'కు వెళ్ళి లైటు వేసుకుని కూర్చున్నాను. గదంతా దుమ్ము కొట్టుకుని ఉన్నది; కూజాలో నీళ్లు అడుగున తేరుకుంటున్నై, వారం రోజుల్నుంచీ.

తోచక 'రమణి' ఇంటికి వెళ్లాను. నేను వెళ్ళేసరికి వాకిట్లో కూర్చుని ఏదో వ్రాసుకుంటున్నాడు. నన్ను చూడగానే "ఏంరోయ్ – ఎప్పుడొచ్చావ్ ?" అన్నాడు, ఆహ్వానిస్తూ. నేను సమాధానం చెప్పి, పక్కనే కుర్చీలో కూర్చున్నాను.

"అప్పుడే వచ్చావేం ?" అన్నాడు, కలం ముడిచేసి. రమణికొడుకు లోపల్నుంచి వచ్చి, వాళ్ళ నాన్న వళ్ళో కూర్చున్నాడు. నేను ఇంటిదగ్గరి సంగతంతా చెప్పి "నా కెక్కడున్నా తోచటం లేదురా" అన్నాను. రమణి కొడుకుతల నిముర్తూ నవ్వి ఊరుకున్నాడు.

కాసేపుండి "మీ మామయ్య అఖండుడ్రా" అన్నాడు ఇంకొస్త నవ్వు జోరు చేసి.

నా కర్థంగాక "ఏం ?" అన్నాను, నేను గూడా నవ్వి.

"గట్టిగా అన్నాళ్ళే – అయినా, నీ ముఖం వేదాంతం, ఇదెక్కడ పట్టుకుందిరా?" అన్నాడు రమణి మళ్ళీ నవ్వి' రమణికొడుకు వాళ్ళమ్మ పిలుపు విని' లోపలకు పరుగెత్తుకుని వెళ్లాడు.

నేను మాట్లాళ్ళేదు.

రమణి ఓమారు ఇంట్లోకి వెళ్ళివచ్చి, మళ్లీ కూర్చున్నాడు ముసిముసిగా నవ్వుకుంటూ. నేను మాట్లాడకుండా సిగరెట్టు కాలుస్తున్నాను.

"ఒరే–వెధవ్వేషాలు వెయ్యక, నే వేసిన ప్రశ్నలకి సూటిగా సమాధానం చెప్పు" అన్నాడు కాసేపటికి; రమణికంఠంలో గంభీరత తొణికిసలాడింది.

నేను వాడివేపు చూశాను.

"ఒకవేళ మీ మామయ్య కూతుర్నే గనక అయినట్లైతే, నీవు పెళ్ళిచేసుకునేవాడివేనా?" అన్నాడు రమణి.

నేను కొస్త తటపటాయించాను; కొంచెంసేపటికి, "బహుశా" అన్నాను.

"ఇప్పుడు నీ వేడికే వేదాంతమంతా అప్పుడేమయ్యేది ?" అన్నాడు తిరిగి.

నేను కొస్త నింపాదిగా, వాడికి నచ్చ చెప్పాలని యత్నిస్తూ, "నేను వైవాహిక జీవితానికి భయపడటంలేదు. శకుంతల నాకు గాకుండాపోయింతర్వాత, నా హృదయానికి ఆహ్లాదం కలిగించే వస్తువు దొరకదని వెనక్కి తీస్తున్నాను" అన్నాను.

రమణి కాసేపు మాట్లాళ్లేదు; చివరికి "ఏం – శకుంతల అంత బాగుంటుందా, యేంరా ?" అన్నాడు.

"అది నే చెప్పలేను: శకుంతల్ని మించిన వాళ్ళు చాలమంది ఉండొచ్చు. నిజానికి శకుంతలలో చెప్పుకోదగ్గ మంచి ఏమీ లేదు; కాని శకుంతలలాగా నన్నెవరూ ఆకర్షించలేరు" అన్నాను, సిగరెట్టు విసిరేసి.

రమణి మాట్లాళ్ళేదు; కుర్చీచేతులమీద తబలా వాయిస్తున్నాడు.

"శకుంతల నా మనో నేత్రంముందు నిలిచిఉన్నంతకాలం, ఇంకో అమాయకురాలి కంఠానికి ఉరిపోయటం తప్ప, నే సంసారం చెయ్యలేన్రా" అన్నాను.

రమణి నావేపోమారు చూసి, దృష్టి మరల్చుకున్నాడు; మాట్లాళ్ళేదు. నా కళ్ల ముందు శకుంతల చిలిపినవ్వు నవ్వింది, చిన్ననాటి అమాయకత్వంలో; నన్ను చూసి సిగ్గుపడి తొలగిపోయింది, యీనాటి మౌగ్ధ్యంతో. కళ్లు గట్టిగా మూసుకున్నాను.

రమణి బల్లమీద కలం చివర్తో కొడ్తూ, లయ వేస్తున్నాడు.

"అదిగాక ఫినాన్షియల్‌గా నా పరిస్థితి ఏమీ బాగాలేదు–నీకు తెలుసు" అన్నాను; రమణి నావేపు వెర్రిచూపు చూశాడు మాట్లాడకుండా.

"అయినా, పెళ్లిచేసుకోవటంలో నాకేమీ అర్థం కనబడటంలేదు" అన్నాను ఆఖరి మాటగా.

రమణి విషాదంగా నవ్వి ఊరుకున్నాడు.

చలిగాలి ముదిరింది: మళ్లీ కనబడ్తావుగా ?" అని కుర్చీలోంచి లేచాను' రమణి మాట్లాళ్ళేదు. తలకాయ వంచుకునే, "ఊఁ"అన్నాడు అన్యమనస్కంగా. మళ్ళీ తెప్పరిల్లుకోని "పోదువు గాన్లే కూచో – ఏం తొందర ?" అన్నాడు నా చేయి పట్టుకుని లాగుతూ.

నేను కూచోలేదు; ఏదో వంకపెట్టి రూముకు బైలుదేరాను.

## 15

లీలగా నా హృదయంలో బుసలు కొడ్తున్న ఆవేదనయొక్క అసలు స్వరూపం నాకు స్పష్టం కాలేదు. ఈ సంసారంలో ఇరుక్కోటానికే నేను వెనక్కి తీస్తున్నానో, లేక శకుంతలలాంటి నా

# కోలినాస్

## ప్రకృతియొక్క ఆకుపచ్చ క్లోరోఫిల్ గలది

...మీ దంతధావనంలో యింతకు ముందెన్నడు లేని గొప్ప పురోగమనం!

మొక్కలను తాజాగా ఆకుపచ్చగా ఉంచు ప్రకృతి సిద్ధమైన క్లోరోఫిల్‌తో...నోటి దుర్వాసనను రోజంతా పోగొట్టుకొనుడు...దంతక్షయమును చిగుళ్ల బాధను ఆపుకొనుడు!

నిస్సందేహంగా మీకింతకు పూర్వమెన్నడు లభించని అమోఘమగు దంతరక్షణ యిదియే! క్లోరోఫిల్ గల అద్భుతమగు క్రొత్త కోలినాస్ దంతక్షయమును రోగ క్రిములను నాశనము చేయుటయేగాక నోటి దుర్గంధము ఒక రోజంతా లేకుండ చేయును....ఇది మొక్కలను నవనవగా తాజాగా ఉంచు ప్రకృతి సిద్ధమైన రసాయనిక పదార్థమగు ఆకుపచ్చని క్లోరోఫిల్ వల్లనే. క్లోరోఫిల్ గల కోలినాస్ అమోఘమైనదగుటయేగాక పొదుపు కూడా. పొడి బ్రష్ మీద అరంగుళమే చాలు. ఆకుపచ్చని అట్టపెట్టెలో అన్ని దుకాణాలలో దొరకును. నేడే కొని దంతశాస్త్రంలోకెల్ల అపూర్వపు రోగమనంవల్ల కలిగే లాభములను పొందండి!

క్రొత్త ఆకుపచ్చ అట్టపెట్టెను గమనించుడు.
స్టాండర్డ్ కోలినాస్ (పసుపుపచ్చ లేబిల్ గలది) కూడ లభించును.

**2,000 అమెరికన్ దంతరోగులు క్లోరోఫిల్‌యొక్క సత్ఫలితములను నిరూపించుచున్నారు.**

నాలుగు సంవత్సరముల పరిశోధన, దాదాపు 2,000 అమెరికన్ రోగులపై యింతకు ముందెన్నడు జరుపబడని అత్యంత పెద్ద పరిశీలనవల్ల రుజువైన దేమంటే. క్లోరోఫిల్ గల డెంటల్ క్రీమ్

- చిగుళ్ల పొంగున్న ఇబ్బందులన్నిటిని అరికట్టును
- నోటి దుర్గంధములను ఒక రోజంతయు పూర్తిగా పోగొట్టును
- దంతక్షయ క్రిములను అమోఘంగా నాశనం చేయును

మీ దంత వైద్యునకు ఈ శోధనలన్నియు తెలుసు. ఆయన యీ ఫలితములను నిర్ధారణ చేయగలడు.

* * *

★ నోటి దుర్గంధములను పోగొట్టును
★ చిగుళ్లకు పటుత్వము నిచ్చును
★ దంతక్షయమును అరికట్టును




'కోలినాస్' చిరునవ్వులో ఆరోగ్యం అగుపడుతుంది!

భారతదేశంలో తయారు చేయువారు: జ్యాఫ్రే మానర్స్ & కం. లి. బొంబాయి 1

GK 7128

# అతకని బతుకులు



"ఓరీ పిపీల కాధమా ! ఆ బొమ్మను వదిలి యీవలకు రమ్ము! ఒక్కవేటున నిన్ను సంహారించెదను.!!

హృదయచంద్రిక తిరిగి దొరకదని తటపటాయిస్తున్నానో తేల్చుకోలేకపోయినాను.

హోటల్లో భోజనం కానిచ్చి, గదికి చేరేసరికి తొమ్మిదైంది. దుమ్ము దులుపుకుని పక్క వేసుకుని పడుకున్నాను.

మర్నాడెప్పుడో ఒక క్లాసుంది; కాలేజీకి వెళ్లానేగాని, పాఠం చెప్పటానికి మనస్సు నిరాకరించింది. వెళ్ళి మెదలకుండా కూర్చున్నాను, ఓ లెఖ్ఖ చెయ్యమని. కొంతమంది పుస్తకాలు తెరిచారు; మిగిలినవాళ్లు నావంకే చూస్తుండిపోయినారు.

"ఊఁ - కానివ్వండి" అన్నాను, చివరి బెంచీలకేసి చూస్తూ.

అంతా అచ్చుపుస్తకాలు తెరిచి, లెఖ్ఖ చదువుకుంటున్నారు.

నేనిక ఏపనీ చెయ్యలేను; ఎంతకాలం యీ పరిస్థితిలో ఉంటానో నాకే తెలీదు. రాజీనామా ఇచ్చెయ్యటమే మంచిదనిపించింది. తలఎత్తి చూశాను; ఒకళ్ళతో ఒకళ్లు సమాలోచన్లు సాగిస్తున్నారు: వెనక పేజీలు తిరగేస్తున్నారు.

"ఏం - రావటంలా ?" అన్నాను, లేని నవ్వు తెచ్చిపెట్టుకుని.

ముందరి బెంచీలోనుంచి ఒకతను, "తెస్తున్నామండి" అన్నాడు తలకాయూపి. నేను వరాండాలోని పిట్టగోడ వేపు చూస్తున్నాను.

కాని, ఏపనీ చెయ్యకుండా జీవించటం కష్టం; పైగా నన్ను నమ్ముకుని కూర్చున్న వాళ్ళంతా మనస్సులో మెదిలారు. నామీద నాకే జాలివేసింది.

మెల్లిగా గంట అయిపోయింది; "ఇంటిదగ్గర ఆలోచించుకు రండి" అని నేను క్లాసులోంచి వచ్చేశాను.

సాయంత్రం రమణితో కలిసి పార్కులో ఓ మూల కూర్చున్నాను. వాడా రోజు తను చేసిన ఘనకార్యాలన్నీ ఏకరువు పెడ్తున్నాడు; నేను మెకానికల్‌గా నవ్వి ఊరుకున్నాను.

కాసేపైంతర్వాత, కొంచెం అనుమానిస్తూ, "ఒరే - నేనో మాట అడుగుతాను గాని, ఏమీ అనుకోకుండా చెప్తావా?" అన్నాడు.

"అడుగు, ఫరవాలేదు" అన్నాను, నవ్వి.

"నీవు చాలా పరధ్యానంగా ఉంటున్నావనీ, వెనకటంత సిన్సియర్‌గా ఉంటంలేదనీ కంప్లెయింట్స్ వస్తున్నై" అన్నాడు, తటపటాయిస్తూ.

నేను మెదలకుండా ఊరుకున్నాను, నవ్వి; రమణి పార్కులోకి అప్పుడే వస్తున్న అమ్మాయిలజంటని గమనిస్తూ, నా తొడమీద ఒకటి వేశాడు.

వాళ్ళు చెట్లచాటుకు వెళ్లింతర్వాత నా వేపు చూసి, చిరునవ్వు నవ్వాడు. నేను బదులుగా మందహాసం చేశాను.

"నీవు గూడ ఎందుకొచ్చావ్, ఆశ్రమానికి?" అన్నాను, కాసేపుండి.

"తాయికోసం కాదులే" అన్నాడు రమణి, నవ్వి.

"సన్యాసం పుచ్చుకోటానికా ?" అన్నాను, నేను గూడా నవ్వుతూ.

"నా ఖర్మం కాలిందిరా - నీకు మల్లే నేను 'డిజప్పాయింటెడ్ లవర్'నిగాదు" అన్నాడు. నేను మాట్లాళ్ళేదు.

కాసేపైంతర్వాత, "నీవు నిజంగా చెప్పరా - 'తాయి'ని లవ్ చెయ్యలేదా, నీవు?" అన్నాడు రమణి, కొస్త పరీక్షగా. నేను గడ్డిపోచలు తుంపుతున్నాను; మాట్లాళ్లేదు.

"నే నెందుకొస్తే ఏంలే? - వెళ్ళిన పని గూడా కాలేదు" అన్నాడు రమణి, నిట్టూర్చి.

(54 వ-పేజీ చూడండి)

# ముసలమ్మ వుత్తరం

శ్రీ బొద్దనపల్లి యజ్ఞనారాయణశర్మ



మునలమ్మ, కరణంగారు, చుట్టం రామయ్య, పెద్దమనుష్యులు, టపాబంట్రోతు, పొరుగామె సుబ్బమ్మ.

## 1

(ముసలమ్మ యిల్లు : సుబ్బమ్మ, మున లమ్మ కూర్చుని వుంటారు.)

సుబ్బ : చెట్లపాదులన్నీ ఎండిపోయిన [illegible] య్యేం అప్పా ?

ముస : ఎండిపోక యేముందే. ఆటి మొఖాన, నా మొఖానా నీళ్లెవరు బోస్తారు? అబ్బాయేమో, వూడ్పులుగానూ మరి! ఆ తుమ్మలపల్లి యవసాయం మండబెట్ట పోయ్యాడు. కోడలేమో పుట్టింటి కాడ అములు మండబెట్టబోయింది.

సుబ్బ : అయ్యో! అదేంటమ్మా! ముసిలి ముండవు. నీమీద సంసారం పారేసిపోవడ మేంటి ? పోనీ ఆ పసికూనల్ని గూడా తీసుకుబోతేయేం ?

ముస : అమ్మా ! ఎవరికి వారు సొతం త్రులు. ఎవరు చెపుతారు ? అది ఆడింది ఆట, పాడిందిపాట. పిల్లలు వెంటుంటే దాని ఆటలు సాగవుగా మరి! ఇంతకీ, ఏమిటో నేను కొస్తాగుటుక్కు మనకూ డదూ సుబ్బమ్మతల్లీ; నమ్మ నమ్మకపో, పదిమంది కట్టిన కొంపలో వుండి చెపుతున్నా. నేనీ యాతన్లు పడలేను తల్లీ! ముక్కు మూసుకుంటె మూడుఘళ్లు.

సుబ్బ : కొడుకూ, కోడలూ వున్న నువ్వే యిదయితే, బిడ్డా పాప లేనిదాన్ని నే నేమనుకోవాలి ?

ముస : అబ్బాయైనా వస్తాడేమో నను కుంటే, వాడూ రాలేదు. పిల్లలు బొత్తిగా కూడుగూడా తింటల్లా.

సుబ్బ : అన్నాల్దిన్నారా ? అప్పా.

ముస : వూ! ఏం అన్నం ? వుత్త మజ్జి గాన్నం తప్ప యేమీ పోదు; పిల్ల లెక్క డికో వెళ్లారు. వాళ్లు రాంగానే తినాలి.

సుబ్బ : అన్నం తిని వస్తాలే అప్ప! యిప్పుడే వండాను; ఏం జేస్తున్నారో చూసిపోదాం అని వచ్చా!

ముస : పోయిరా అమ్మా,

(సుబ్బమ్మ వెళ్లిపోతుంది. ఇంతలో చుట్టం రామయ్య వస్తాడు).

ముస : ఏం ? నాయనా ? యింటిదగ్గ ర్నుంచేనా ?

రామ: అవునమ్మా! యివ్వాళ గన్నారం కోర్టులో మావూరు కేసు వాయిదా వేశారుగాదూ; మావాళ్ళంతా ముందు బోతున్నారు. కాసిని మంచినీళ్లియ్యి, పిన్న మ్మా. తాగిపోతాను.

ముస : అదేమిటి నాయనా ! అన్నం దినిపోదుగాని వుండు. యింకా మేంగూడా తిన్లా. (అని మంచినీళ్ళు తెచ్చియిచ్చింది)

రామ : ఒదిన పిల్లలు యింకా రాలేదే మిటే ?

ముస : యింతవరకుజాడ జాబూ లేదు. అన్నట్టు నాయనా ! ఒక వుత్తరంముక్క రాసిపెట్టుబాబూ. మీ వదినవాళ్ళని రమ్మని. (అని కాగితం, పెన్సలు యిస్తుంది. అలాగే రామయ్య వ్రాసి ముసల మ్మకు యిస్తాడు).

రామ : వెళ్ళొస్తా పిన్నమ్మా ! వాళ్ళు చాలా దూరం పోయివుంటారు.

ముస : నీయిష్టం రెండు మెతుకులు తిను నాయనా అ- - -నవు. (రామయ్య వెళతాడు. ముసలమ్మ పంపించడానికి దర్వాజాదాకా వెళ్తుంది. టపా బంట్రోతు ఆదారే పోతూవుంటాడు).

ముస: ఇదిగో! ఓ పోస్టబ్బాయ్! ఓపోస్ట బ్బాయ్! నాయన్నాయనా! యిటు పిలువు ఆ పోస్ట......, ఆ! నేనే నాయనా పిల్చింది. ఒక్కసారి మా యింటికి రాబాబూ !

పోస్టు : అమ్మా ! ఎందుకు పిల్చారూ !

ముస : ( తెల్లకాగితంమీద వ్రాసిన వుత్తరం తెచ్చి) నాయనా ! ఇది కాస్త మా అమ్మాయిగారివూరు పంపించు నాయనా. నీ కెంతైనా పుణ్యముంటుంది.

పోస్టు: ఇదేమిటమ్మా! యీ కాగితంఎలా పంపించడం ? రెండు అణాలు తీసుకు పోతే, మా ఆఫీసులో కవరని, ఒక సంచి లాటిది యిస్తారు. దానిలో యీ వుత్తరం పెట్టియిస్తే పంపుతాం.

ముస : రెండణాలు బెట్టి సంచెందుకు బాబూ ? మా అబ్బాయి పుస్తకాలసంచీ వుంది. దాట్లో పెట్టి తీసుకుబోయి మళ్లా తీసుకురా.

పోస్టు : నేను గాదమ్మా, తీసుకు పోయేది. అసలు ఆసంచి పనికిరాదు.

ముస : ముసిలిముండను జేసి కాజేద్దా మనుకున్నావా ? రెండణాలు. మూడు నిన్నేం జేస్తానో

(ఇంతలో కొందరు పెద్దమనుష్యులు చేరతారు.)

ఒక పెద్దమనిషి : ఏమిటి ముసలమ్మా ! అదిగాదు. ఆ అబ్బాయి చెప్పిందే రైటు. బేడా కాకపోతే మూడుకాన్లు బెడితే కార్డు వస్తుంది. దానిమీద వ్రాసి పోస్టులో వెయ్యాలమ్మా! (పోస్టుమాన్‌తో) ఆ ముస లమ్మకు తెలియదులే బాబూనీవెళ్లు.

ముస : అట్టాగా. సరేలే నాయనా ! ఆనక తెప్పిస్తాలే కారుడు. (అందరూ వెళతారు. సాయంకాలానికి కార్డు తెప్పి స్తుంది.)

## 2

(కరణంగారి యిల్లు. వ్రాసుకుంటూ వుంటాడు. ముసలమ్మ కార్డు తిసుకుని నిల్చుంటుంది)

కరణం: ఏం ముసలమ్మా! ఏం పనిమీద వచ్చావు ?




ముస : మాకోడలు పుట్టింటికి వెళ్లింది. కాస్త వుత్తరం వ్రాసిపెట్టండి బాబూ.

క : ఇచ్చేకార్డు. మీ కోడలు పేరు ?

ముస : రామసుబ్బమ్మండీ.

క : ఏవూరు ?

ముస : దూరంపల్లిబాబూ.

క : ఆవూళ్ళో పోస్టాఫీసుందా?

ముస : లేకేం. మా ఆచార్లుగారి అంజయ్యగారే పోస్టులో వుండేది.

క : ఆ! ఏమిటి కబుర్లు.

ముస : నువ్వెళ్లిన కాణ్ణించీ వర్షాలు లేక చెట్లుపాదులు వాడిపోయినయ్.

క : (వ్రాస్తూ) ఆ తర్వాత?

ముస : నువ్వెళ్లినకాణ్ణించి తిండీ తిప్పలు తినక పిల్లలు బొత్తిగా యిట్టా అయిపోయినారు. (మనం సామాన్యంగ బక్క-చిక్కి-పోయినాడని చెప్పడా! చెయ్యి వేళ్ళన్నీ ముడిచి చూపుడువేలు మాత్రం ఇటు అటు ఆడిస్తాం. అల్లా ముసలమ్మ వేలు చూపిస్తుంది.)

క : (వ్రాస్తూ) ఆ తర్వాత?

ముస : ఏంరాశారు బాబూ.

క : నువ్వెళ్లిన దగ్గరనుంచీ, పిల్లలు తిండి తినక బక్క చిక్కి పోయినారు. (అని చదువుతాడు)

ముస : చిక్కిపోవడంగాదు బాబూ! బొత్తిగా యిట్టా అయిపోయినారని రాయండి (అని మళ్లీ వేలుచూపిస్తుంది)

క : దాని అర్థమే యిది. నువ్వు వేలు చూపిస్తే యిందులోగూడా వేలు చూపిస్తున్నారని వ్రాయనా? అట్లా వ్రాయడం తప్పు. కుదరదు.

ముస : అదేమిటిబాబూ! నేచెప్పినట్టు రాయండిబాబూ.

క : అంతేనమ్మా! నువ్వు చెయ్యిచూపితే చెయ్యి, తల చూపితే తల యిందులో బొమ్మ వెయ్యమంటావా? ఎవరు వ్రాసినా యింతే. తర్వాత?

ముస : తరవాత......బొత్తిగా గొడ్లు పట్టుమని (సామాన్యంగా మనం యింత పరిమాణం అని రెండు చేతుల్తో చూపించుతాం. అలాగే చూపిస్తూ) యింతమేతైనా తినడం లేదు.

క : ఆ! తర్వాత?

ముస : ఏంరాశారుబాబూ!

క : గొడ్లు మేత బొత్తిగా ఏమీ తినడం లేదు.

ముస: మళ్ళా అట్టాగే రాశారేంబాబూ! పట్టుమని యింతైనా తినడం లేదని రాయండీ! బాబూ!

క : దాని అర్థం అదేనమ్మా! నీకు వుత్తరం వ్రాయడం నాకు చేతగాదు. ఎవరిచేతనైనా వ్రాయించుకోపో (అని కసురుకుంటాడు)

ముస : లేదులేబాబూ! బాబూ వ్రాయండి. (బతిమలాడి) ఇక్కడ చాలా యిబ్బందిగా వుంది, గేదెలు పట్టుమని యిన్ని పాలైనా యివ్వడంలేదు. కనుక వెంటనే రమ్మని వ్రాయండి (అని వేరచూపిస్తూ అంటుంది.)

క: అమ్మయ్యా! నీకు వుత్తరం వ్రాయడానికి నీ భాష ప్యాసయి రావాల్సిందే గానీ, ఇతరులికి చేతగాదు. పో అమ్మా! యిహపో. నాప్రాణం తీశావు. ★

సీరియల్ నవల

# రెండు మహానగరాలు

చార్లెస్ డికెన్స్

## 42

డార్నేను తిరిగి అరెస్టుచేసి తీసుకుపోయిన సంగతి మిస్ ప్రాస్‌కు తెలియదు; హాడావిడిగా వీధివెంట నడిచి వెడుతోంది; తట్ట నెత్తిన పెట్టుకుని క్రంచర్ ఆవిడప్రక్కనే నడుస్తున్నాడు. పాంట్–న్యూ వంతెనమీదినుంచి నది దాటి అవతలి వేపుకు వెళ్ళారు. వీధిని నడుస్తున్నంతసేపూ ఇద్దరూ, అమిత జాగ్రత్తగా ఇటూ అటూ పరకాయించి చూస్తూనే వున్నారు. దుకాణాలముందు జనం ముఠాలు ముఠాలుగా మూగి, వాళ్ళు తెలియని వీరాలాపాలతో పేట్రేగిపోయి వున్నారు. అలాంటి దుకాణాలదగ్గిరికి పోకుండా, తప్పించుకుని ముందుకు నడుస్తున్నారు. ఆనాటి సాయంకాలం మంచు దట్టంగా పట్టి బాగా మసకచీకటిగా వుంది. వీధి దిపాలు మాత్రం మినుకుమినుకుమంటూ వెలుగుతున్నయ్. ఇక, ఆ మసకచీకట్లలో, కొరివి దయ్యాల్లా అక్కడక్కడ కమ్మరకొలుములు మాత్రం బీభత్సంగా మండుతున్నయ్. విప్లవసైన్యానికి కావలసిన నాటు తుపాకులూ, కత్తులూ, ఆ కొలుములదగ్గిర తయారవుతున్నయ్.

మిస్ ప్రాస్ కావలసిన చిల్లర సామాన్లు కొన్ని కొన్నది. దీపానికి కిరసనాయిలు కూడా కొన్నది. ఇక కావలసిందల్లా వైన్. వైన్ కొనటానికి ప్రతి సారాదుకాణంలోకి తొంగిచూస్తుంది. అక్కడ జనం గందరగోళంగా వుండటం చూసి మళ్లీ ముందుకు సాగుతుంది. ఇలా వచ్చివచ్చి ఒక పానశాలదగ్గిర నిలబడ్డది. తక్కిన సారాదుకాణాలదగ్గిరకంటే, ఇక్కడ కొంచెం ప్రశాంతంగా వుంది. ఇక్కడా కొన్ని యెర్రటోపీ లున్నాయిగాని మరీ అంత రక్తోన్మాదంలో లేవు; ఫరవాలే దనుకుంది మిస్ ప్రాస్; క్రంచర్ ముఖంలోకి చూచింది; క్రంచర్ కూడా అదే అభిప్రాయంలో వున్నట్టు కనుపించాడు. దాంతో ధైర్యంచేసి లోపలికి అడుగుపెట్టింది.

ఆ పానశాలలోవున్న దీపాలన్నీ కావురేసి మినుకు మినుకుమంటున్నయ్; కొంతమందిసోదరులు పొగచుట్టలు పీలుస్తూ చీట్లపేక వేస్తున్నారు; చొక్కాగిక్కా లేకుండా మసిపులుముకున్న చిన్నబట్ట లాగూమాత్రం తొడుక్కున్న ఒక కార్మిక సోదరుడు పత్రికొకటి చేతబట్టుకుని కొంచెం గాళగాత్రంతో చదువుతున్నాడు. మరికొంతమంది అతనిచుట్టూకూర్చుని వింటున్నారు. కొన్ని తుపాకులూ, కత్తులూ బల్లలమీద చెల్లాచెదురుగా పారేసున్నయ్; మరికొంతమంది సోదరులు ముందున్న బల్లమీదికి వొరిగి ఎలుగ్గొడ్డుల్లా గుర్రుగొట్టి నిద్రపోతున్నారు.

మిస్ ప్రాస్ అమ్మకంబల్లముందుకుపోయి, తనకు ద్రాక్షసారా కావాలని చెప్పింది. అమ్మకందారు ద్రాక్షసారా కొలిచి పోస్తున్నాడు. ఇంతలో పానశాలలో ఒకమూలనుంచి ఒక వ్యక్తి లేచి బయటికి వచ్చేస్తున్నాడు. ఆరావటంలో, అతను మిస్ ప్రాస్‌కు ముఖాముఖి తారసిల్లాడు. అతను కంటబడగానే, మిస్ ప్రాస్, 'ఓరేయ్!'—అంటూ ఒక గావుకేక పెట్టి, అమాంతం కావిలించుకోబోయింది:

ఆ గావుకేకవిని అక్కడున్నవాళ్లంతా ఒకసారి లెలబెలా లేచి నిల్చుని నిర్ఘాంతపడి చూస్తున్నారు. ఎవణ్ణో నరికెయ్యడమో, అలాంటిదేదో జరిగుంటుందనుకున్నారు. కాని యెవ్వడూ నేల వొరిగిపోయినట్టు కనుపించలేదు; ఫ్రెంచి విప్లవవీరుడులా కనుపించుతున్న ఒక మొగవాడూ, అతనికి యెదురుగా యీ ఆంగ్లేయవృద్ధకన్యా మాత్రం కనుపించుతున్నారు.

భీభత్సకరమైన సంఘటన యేదీ జరగకపోవటంతో సోదరులందరికీ చాలా ఆశాభంగం కలిగింది. ఫ్రెంచిభాషలో ఏదో గొణగొణ లాడుకున్నారు. ఆ గొణగొణ యేమిటో ప్రాస్‌కు రవ్వంతేనా బోధపడలేదు. భాష అర్థం కాకపోవటమేగాదు; మాటలు కూడా వినపడే స్థితిలో లేదు. ఆ వ్యక్తి కంటబడగానే ఆవిడా, వెంటవున్న క్రంచరూ కూడా ఆశ్చర్యచకితులై చిత్రితప్రతిమల్లా స్తంభించిపోయారు.

ఆ వ్యక్తి కొంచెం విసుక్కుంటూ, 'ఏమిటి గొడవ' అన్నాడు మెల్లిగా, ఆంగ్లభాషలో.

మిస్ ప్రాస్ వసపోసిన పిట్టలా అందుకుంది:

'ఒరే నాయినా! సాల్మన్, తమ్ముడూ!—ఒరే అబ్బీ! అబ్బా! ఎన్నాళ్ళయిందిరా తండ్రీ కంటబడి—కళ్ళు కాయలు గాచి పోయాయి గదరా?'—

'ఇష్! సాల్మన్ గీల్మన్ అంటూ దెయ్యపుగోం తెట్టుకు అరవకు—నా ప్రాణం తీయిస్తావా యేమిటి?'

మిస్ ప్రాస్ వలవలా యేడిచేస్తోంది: 'అదేమిట్రా తమ్ముడూ! అలాంటి నోగాయిత్యం మాటలూ నువ్వూనూ?'—

'వోగాయిత్యం లేదు నా శ్రాద్ధం లేదు—నేను బ్రతకాలనుంటే కాసేపు నోరుకట్టుకో—అంతగా మాట్లాడాలనుంటే, అలా బయటికి తగులడు—ఈ మనిషెవడు?—దయ్యాన్ని చూసినట్టు ఎందుకు నావంక అలా తెల్లపోయి చూస్తాడు?'

'మనవాడేరా తండ్రీ! క్రంచర్!'

'సరే అతన్నికూడా బయటికి రమ్మను—ఏమిటా వెర్రి చూపు?—'

ఈ మాటలు ఇంగ్లీషులో [illegible] అని—మిగతా సోదరు

అనువాదం: తెన్నేటి సూరి

ల్తో, ఈ వ్యవహారమంతా సర్దేస్తూ యేదో ఫ్రెంచిలో ఒకటి రెండు వాక్యాలు చెప్పేసి, బయటికి నడిచాడు.

అమ్మకం బల్లదగ్గిర యివ్వాలిసిన డబ్బు లెక్కజూసి యిచ్చేసి, ఆవిడా, క్రంచరూకూడా, సాల్మన్‌తోపాటు వీధిలోకి నడిచారు.

వీధిమలుపు తిరిగి ఒక చీకటి గొందిలోకి వచ్చిం తరవాత సాల్మన్ అక్కడ నిలబడ్డాడు.

'ఆఁ!—ఇప్పుడు చెప్పి తగులుడు!—ఏవిఁటి అంటావ్?'

'అయ్యో నా తండ్రీ! అంత కోపమేవిఁట్రా!—ఇన్నాళ్ళకి కంటబడి యిదేట్రా నన్ను పలకరించాల్సిన వరస? — నా మీద నీకు రవ్వంతేనా ప్రేమలేదుట్రా?—'

'ప్రేమగాదు నా బొంద' అంటూ, అమిత విసుగ్గా అక్కగారిని ముద్దుబెట్టుకున్నాడు-'ఊఁ' అక్కడికి తృప్తితీరిందా?-'

సంతృప్తేనని సూచిస్తూ తలవూపింది మిస్ ప్రాస్. సంతోషం పట్టలేక ఉత్కంఠతో సన్నగా ఏడ్చింది.

'నువ్వు హఠాత్తుగా కనుపిస్తే నేను ఆశ్చర్యపడి చావనేమో అని అనుకుంటున్నావల్లే వుంది—నువ్వు ఇక్కడ వుంటున్నావన్న సంగతి నాకు చాలా రోజులనుంచీ తెలుసు; నిజంగా నేను నాశనమై పోకుండా వుండాలని నీకుంటే, కిక్కురు మనకుండా నీ దారిని నువ్వుపో!—నా దారిన నన్నుపోనీ — నాకు పనుంది. నే నిక్కడ ఉద్యోగం చేస్తున్నాను' — అన్నాడు సాల్మన్.

'అయ్యో నీయిల్లంతా బంగారంగానూ! నీకేంకర్మ మొచ్చిందిరా నా తండ్రీ!—మాణిక్యంలాంటి ఇంగ్లీషు బిడ్డకి నీ కిదేం గతిరా?—యీ తిక్క దేశంలో యీ తిక్కముండావాళ్ళ దగ్గిర నౌకరీ యేవిఁట్రా నా తండ్రీ!—ఇంతకన్నా నువ్వు గోతిపాలు...'

'ఆఁ!—నన్నెలాగూ గోతిలో పెట్టించడానికే నువ్విన్నాళ్ళ సైతాన్‌లా నాకు దాపరించావు—ఎవడేనా వింటే పీక తెగిపోతుందే నీ గొంతుకోయ్యా!—'

'అట్టాగా తండ్రీ!—అదా—సరే సరే, నోరుమూసుకు వెళ్లిపోతా!—నామీద యేవీఁ కోపం లేదని నవ్వుతూ ఒక ముచ్చటైన మాట చెప్పు!—వెళ్ళిపోదాం మరి'—

'కోపం లేదు గీపం లేదు—వెళ్ళవే బాబూ!'—

సాల్మన్ విసుక్కుంటూ ఈ మాట అంటూండగానే క్రంచర్ ముందుకు అడుగేసి కొంచెం మొరటుగా సాల్మన్ భుజం మీద చెయ్యేసి: 'ఇదుగో తమ్ముడూ—ఇటు చూడు!' అన్నాడు.

'ఏవిఁటి?'—

'నిన్ను ఒకమాటడగాలిలే!—ఇంతకీ నీ పేరు జాన్ సాల్మనా?—లేకపోతే సాల్మన్ జానా?—ఏది ముందు ఏది వెనక?'—

ఆ వ్యక్తి తెల్లబోయి క్రంచర్ వంక చూస్తున్నాడు.

'చెప్పలే—ఇంతలోకే యేంపోయింది—మీ అక్క నిన్ను సాల్మన్ అంటోందా—నువ్వు జాన్ అయినట్టు నాకు తెలుసు. అసలు మీ అక్క పిలుస్తున్నట్టు సాల్మన్ గాక అక్కడ ఇంగ్లండులో నీకు అదో వేరేపేరేదో వుండేది. ఏవిఁటదీ—జ్ఞాపకం రాకుండా వుందీ?'

'వేరే పేరేవిఁటీ?—'

'అదే జ్ఞాపకం లేకనేగాదూ అడగటం?'—అన్నాడు క్రంచర్.

'ఛాఛా!—ఇంకో పేరేవిఁటి?'—

'ఛాఛా లేదు గీచా లేదు—చెబుదూ—ఓల్డుబెయిలీ గూఢచారివి, తప్పుడు సాక్ష్యాల నాయాలవు, నిన్ను నేను యెరగనంటగానీ—చెప్పు చెప్పు ఆ పేరేందో!'

'బర్సాడ్'—అని మరో కొత్తగొంతు వినిపించింది పక్కనుంచి; సిడ్నీ కార్టన్ అక్కడ ప్రత్యక్షమయ్యాడు.

'ఆఁ!—అదే అదే,' అంటూ క్రంచర్ కేకబెట్టాడు.

నల్లటి బారాటికోటు తొడుక్కుని చేతులు రెండూ వెనక్కు ముడుచుకుని సిడ్నీ కార్టర్ క్రంచర్ పక్కనే చిరునవ్వు నవ్వుతూ నిల్చున్నాడు. అతనివంక తెల్లపోయి చూస్తున్న మిస్ ప్రాస్‌తో:

(43-వ పేజీచూడండి)



# విజ్ఞాన వీధులు

### "డాక్టర్"




అందడము లేదన్నమాట. అందుకే ప్రతి పున్నమకీ గ్రహణము కలగదు.

శుక్లపాడ్యమినాడు సూర్యుడికి కొంచెం దూరంలోవున్న చంద్రుడు అమావాస్య నాడు సూర్యుడి చేరువనే వుండాలికదా? ఇలాగ ఉన్నప్పుడే సూర్యబింబానికి చంద్రబింబము అడ్డురావడానికి వీలు. కనకనే అమావాస్యనాడే సూర్యగ్రహణము పట్టడానికి వీలు. ప్రతి అమావాస్యకీ ఎందుకు పట్టదంటే, ప్రతి అమావాస్యనాడూ భూమికీ సూర్యుడికీ మధ్యకి రాడు చంద్రుడు.

అనంతాకాశంలో భూమీ చంద్రుడూ తిరుగుతూన్నప్పుడు వీటితోపాటు వీటి నీడలు కూడా తిరుగుతాయి. అయితే భూమినీడలోకి చంద్రుడుగానీ, చంద్రుడి నీడలోకి భూమికానీ చేరడము తరుచు జరగదు, అది జరగడమే గ్రహణము.

## 62. చంద్రగ్రహణం పౌర్ణమినాడూ సూర్యగ్రహణం అమావాస్య నాడూ ఎందుకు కలుగుతాయీ?

నిండు చంద్రుడికి గాని గ్రహణం పట్టదు. ఎందుచేతా అని ఆలోచిస్తే దీనితోపాటు అమావాస్యనాడే సూర్యగ్రహణం ఎందుకు కలుగుతుందో కూడా తెలుస్తుంది. శుక్లపాడ్యమినాడో విదియనాడో చంద్రుణ్ణి చూడండి. సూర్యుడస్తమిస్తూంటే సూర్యుడికి కొంచెందూరంగా చంద్రరేఖ కనబడుతుంది. క్రమంగా పెరిగి, పౌర్ణమినాటికి అటు సూర్యుడస్తమిస్తూంటే ఇటు నిండు చంద్రుడు ఉదయిస్తాడు. పున్నమనాడు సూర్యచంద్రులు భూమి కిటూ అటూ వున్నట్టు కనపడతారు.

చంద్రగ్రహణమంటే సూర్యుని వెల్తురు వల్ల ఏర్పడ్డ భూమినీడ సరిగ్గా చంద్రుడి మీద పడడము. అలా పడినప్పుడు సూర్య దృష్టి చంద్రుడిమీద పడలేకపోడము వల్ల చంద్రుడికి కాంతి పోయి "గ్రహణము" కలుగుతుంది. భూమికి ఒకవైపు సూర్యుడూ సూర్యుడికి ఎదురుగుండా ఇవతలవేపు చంద్రుడూ ఉన్నప్పుడేకదా భూమి నీడలోకి చంద్రుడు పోగలగడమూ? ఇది పౌర్ణమినాడే జరగగలదు; ఏమంటారా? ఆనాడే ఇటు సూర్యుడూ అటు చంద్రుడూ భూమికి ఇటూ అటూ కనపడతారు. అయితే ప్రతీ పౌర్ణమినాడూ భూమి నీడ చంద్రుడిమీద పడదేమి? కారణము తెలుస్తుంది – ఈ ప్రయోగము చెయ్యండి. ధూమాలు పున్నమనాడు సూర్యుడస్తమిస్తున్నప్పుడు, సూర్యుణ్ణీ, నడునెత్తిమీద ఆకాశపు కేంద్రాన్నీ కలిపే (ఊహా) రేఖని తూర్పుకి పొడిగించండి. ఆ రేఖ ఉదయించే చంద్రుడికి తగలదు. అంటే సూర్యుడివల్ల ఏర్పడ్డ భూమినీడకి చంద్రుడు

## 63. ఊడ లన్నవి ఏమిటి?

చెట్లకి సాధారణంగా వ్రేళ్ళూ, కాండమూ, కొమ్మలూ, ఆకులూ, పువ్వులూ అనేవి భాగాలని మనకి తెలుసు. వేళ్లు భూమిలో వుంటాయనీ తక్కిన భాగాలు భూమిపైన వుంటాయనీ కూడా తెలుసు. అయితే మర్రివూడలు భూమికి పైనే వున్న కొమ్మలకి పుడతాయి కదా అవి కొమ్మలా వేళ్ళా? అని అడిగితే కాస్త ఆలోచించాలిసి వస్తుంది. కందా, పెండలమూ, బంగాళాదుంపా, అల్లమూ వంటి దుంపలు భూమిలో పెరుగుతాయే, మరి అవి వ్రేళ్ళా కాండమా? అని ప్రశ్న వేస్తేనూ ఆలోచించవలసివస్తుంది.

అసలు వేళ్ళకీ కాండానికీ లక్షణాలు భూమిలోపల వుండడమూ భూమి మీద వుండడమూ కాదు. వేళ్లకీ శాఖోపశాఖలు బయల్దేరతాయీ, కొమ్మలకీ బయల్దేరతాయి. అయితే కొమ్మలకి కొమ్మలుగా తయారయ్యే మొగ్గలు వుంటాయి. వేళ్ళకి ఈ కొమ్మమొగ్గలుండవు. భూమిలోపల వున్నా, పైన వున్నా కొమ్మమొగ్గలున్నది కాండమే. అల్లమూ, బంగాళాదుంపా వంటి దుంపలకి కొమ్మమొగ్గలుంటాయి. ఆ దుంపల్ని త్రుంచి పాతి పెట్టినట్టైతే మొక్కలు మొలుస్తాయి. మర్రివూడల్ని గానీ, ముల్లంగి దుంపల్ని గానీ, పిల్లితేగల్ని గానీ త్రుంచి పాతి పెట్టితే మొక్కలు రావు. కనక వీటికి కొమ్మమొగ్గలు లేవు. ఇవి కొమ్మలు కావు-వేళ్ళే!

కొమ్మమొగ్గల్నిబట్టి కాండానికీ మట్టలకీగల భేదాన్నికూడా కనిపెట్టవచ్చును. బ్రహ్మజెముడుఅట్టలు కాండభాగాలే కనక వాటి అంచులదగ్గర ఉన్న మొగ్గల్నుంచి కొత్త అట్టలు వస్తాయి. అవి ఆకులూ ఆకుల్లాంటి మట్టలూ మాత్రమే అయివుంటే, వాటినుంచి కొత్త మట్టలు రావడానికి వీలులేదు.

భూమిలో పెరిగేవి వేళ్ళూ కాండభాగములైన దుంపలూ మాత్రమే కావు. ఆముడకాడ అనే గడ్డిలాంటి మొక్క భూమిలో పెరిగే కాండానికి పువ్వులు పూస్తుంది. ఈ పువ్వుల్ని కప్పిగట్టి డిప్పలుంటాయి. వేరుసెనగకూడా భూమిలోనే పువ్వులూ కాయలూ కాస్తుంది.

కనక లక్షణాల్నిబట్టి చెట్టుభాగాల్ని పోల్చాలి కాని అవి ఉండే చోటునిబట్టి కాదు.

## 64. మొక్కలు ఏ యెండకా గొడుగు పడతాయా?

ఆలోచనవున్న మనుష్యుడు పరిస్థితుల కనుగుణంగా తన ప్రవర్తనని సర్దుకుంటాడు. శీతకాలానికి ఉన్నికంబళ్లూ, వేసంగికి ఆరుబయటి నిద్దరలూ తయారవుతాయని మన కందరికీ తెలుసు. మృగాల్లోనూ పరిసరాలకి అనుగుణంగా ఉన్ని పెంచుకోడమూ, నదీతీరాలవైపు సర్దుకోడమూ కనబడుతుంది. మొక్కలలోకూడా పరిస్థితుల కనుగుణమైన యేర్పాట్లు తయారౌతాయంటే చిత్రంగా వుంటుంది.

తామరా, కలవా, అంతరతామరా,

వంటి నీటి మొక్కలు నీటివైపుకాక ఆకాశంవైపు ఉండే పక్కన ఆకులికి ఒక విధమైన చమురుపూత పెట్టుకుంటాయి. ఈ పూత ఉండడమువల్ల గాలికి ఆకుమీద నీటి బిందువు ఎక్కినా, ఆకుకి నీటిపూత పెట్ట లేక జారిపోతుంది. ఇలా ఎందుకవాలీ? అంటే, జవాబు మరీ చిత్రంగా వుంటుంది. సాధారణంగా ఆకులకి కిందివైపున చిన్న చిన్న రంధ్రాలు ఉంటాయి. చెట్టు అనుక్షణమూ వేళ్ళద్వారా పీల్చుకునే నీరు ఈ 'స్తూమము'లనుండి నీటిఆవిరిరూపాన్న బయటికి పోతూంటుంది. చెట్టు మనికికి ఇది అవసరము. తామర ఆకు నీటిలో, తేలుతూంటుందాయెను. కనక దానికి అడుగువైపున స్తూమాలుంటే లాభమేమిటి! కాబట్టి పైవైపున వుంటాయి స్తూమాలు. నీరుకానీ ఈ పైభాగంలో నిలిచిందంటే స్తూమాలు కప్పబడి, మొక్కలోని నీరు ఆవిరిరూపాన్ని పోవడానికి వీలులేదు. అంగువల్ల మొక్క కుళ్లిపోవచ్చు. నీటి మొక్కలు పరిస్థితులకు తగినట్లు స్తూమాల్ని ఆకులపైన ధరించి, చమురుపూతకూడా పెట్టుకుంటాయి.

ఇక నీరు చాలినంత లభించని ఎడారి మొక్కలమాట యేమిటి? అవి ఆకుల సంఖ్యని బాగా తగ్గించేసుకుంటాయి. బ్రహ్మజెముడు (కాండపు భాగాలైన) మట్టల్నే గాని ఆకుల్ని పెట్టదు. కాండము ఎంత ఎండలోనైనా పచ్చిగానే వుంటుంది. ఏమంటే కాండానికి స్తూమాలుండవు. ఆకులుంటే ఎడారిభూముల్లో ఎలాగో దొరికిన నీరు వాటి స్తూమాలంట ఇగిరిపోతుందాయెను. అందుకని (మరుభూముల్లో పెరిగే) బొమ్మజెముడు ఆకుల్ని పెట్టదు. పైపెచ్చు ఆకుల్ని ముళ్ళుగా మార్చుకుని పచ్చిమట్టల్ని పశువులు తినేయకుండా కాచుకుంటాయి. ఎడారిలో పెరిగే కేక్టసు మొక్క తన కాండమధ్యమునగల కాళీలో నీరు దాస్తుంది. పాంథులు దాన్ని నరికి ఆ నీటిని తాగడము కూడా కద్దు.

ముట్టుకుంటే ఆకుల్ని ముడిచేసుకునే 'సిగ్గు చింత' మొక్కని చాలామంది చూచి వుంటారు. ఇది చెఱువు నీటిఅంచున పెరగడము కూడా కద్దు. అప్పుడు నీటివైపు ప్రసరిస్తాయి దీని కొమ్మలు. అవి నీటిలో మునిగిపోకుండా తెల్లని గాలితిత్తుల్ని తయారు చేస్తుంది, ఈ మొక్క తన కాండముచుట్టూ. ఇవి మూడో నాలుగో వుండి మొక్కనంతటినీ తేల్చేస్తాయి! నీటి మొక్కల్ని మెల్లిగా బెల్లించి ఏ బురద నేలలోనో పెంచితే ఆకులకి స్తూమాలున్న పార్శ్వము అడుక్కి తిరగవచ్చును.

వేళ్లు భూమివైపు పెరుగుతాయన్నది వృక్షశాస్త్రసూత్రము. మర్రిఊడలు కూడా కిందికే పెరుగుతాయి చూడండి. అయితే కుడచెట్టు ఈ సూత్రాని కెదురు తిరిగి, సాధారణంగా పెరిగే బురదలో వేళ్ళకి వాయువు దొరకదని, వేళ్ళని ఆ బురదలోంచి పైకి పొడుస్తుంది!

## చిట్టిప్రశ్నల జవాబులు

—ఎవరికి వచ్చిన స్వప్నాలు వారి అనుభవాల్ని ముక్కలుగా కత్తిరించి పేక లాగ కలిపేసి అప్పుడు వరుసగా చూసినట్లుంటాయి. అంధుల స్వప్నాల్లో శబ్దాలు స్పర్శలూ మిళితమై వుంటాయీ, బధిరుల స్వప్నాల్లో దృశ్యాలూ స్పర్శలూ మిళితమై వుంటాయి. అంధత్వమూ బధిరత్వమూ మధ్య జీవితంలో వచ్చిన వారి స్వప్నాలు మాత్రం అందరి స్వప్నాలులాగే వుంటాయి.

—పుట్టగానే ఏడవకుండా నవ్విన శిశువుల సంగతి మేమెక్కడా వినలేదు. శిశువులు పుట్టగానే ఏడవడంవల్ల తల్లిగర్భములో నున్నప్పుడు పనిచేయని వారి వూపిరితిత్తులు పనిచేసి వారి చిన్ని శరీరములో ప్రవహించే నెత్తురుని శుభ్రపరుస్తాయి. గర్భములో వున్నప్పుడు బొడ్డుత్రాడుద్వారా తల్లి నెత్తురే శిశువులో కూడా ప్రవహిస్తుంది కనుక గర్భస్థశిశువు వూపిరితిత్తులు పనిచేయవు. పుట్టిన శిశువు ఏడవకపోతే నెత్తురు శుభ్రపడక పీక నొక్కినవారు చచ్చిపోయినట్లు చచ్చిపోతుంది.

—మానేయాలని నిశ్చయంగా అనుకుంటే మనిషి మానేయలేని అలవాట్లు ఏవీ లేవు శాస్త్రిగారూ!

—కొఱివి దయ్యాలు వున్నవని మేము నమ్మం. 'కొఱివి దయ్యాలు' అని అంటూనే అవి ఏ రూపంలో కనపడతాయని అడుగుతారేం? వైజ్ఞానికు డెవ్వడూ కొఱివిదయ్యాన్ని చూసి వర్ణించలేదు. మరి వాటినిగురించి ఏవిటి చెప్పమంటారు శంకరయ్యగారూ?

—చప్పట్లు చరిచినప్పుడు రెండు చేతులకీ మధ్యనున్న గాలి గట్టిగా నొక్కబడి సన్నసందులలోంచి గభీమని బయటికి రావడంవల్లనే 'ఠాప్' మనే శబ్దం వినబడుతుంది. నీరు గాలిలాగ నొక్కబడదు. చేతులు రెండూ చేరుతూండగానే చేతుల మధ్యనుంచి నీరు తప్పుకుపోతుంది. కేవలం చేతుల ఘాతవల్ల పుట్టగల శబ్దం గట్టిది గాదు. అందువల్ల నీటిలో చరిచిన చప్పట్లు వినబడవు. అయితే చప్పుడన్నది చేస్తే గాలిలోకంటె నీటిలో చాలాదూరం వినబడుతుంది. పెద్దపెద్ద నదుల్లో స్నానానికి మునిగిన

# ★ విజ్ఞాన వీధులు ★

ప్పుడు దూరంగా వున్న మోటారులాంచి శబ్దం చక్కగా వినబడుతుంది. అదే గాలిలోంచి వింటే వినబడకపోవచ్చు.

—ఒకసారి ఏ కప్పనో మ్రింగిన తర్వాత ఆ కప్ప తాలూకు శరీరం పూర్తిగా జీర్ణమైపోయేవరకూ పాము మరి దేనినీ మ్రింగదు. ఇలా ఆహారం తినకుండా పాము చాలా రోజు లుండగలదు. ఈ సంగతి గుర్తించని మన పూర్వులు పాము ముఖ్యంగా గాలి మేతవల్లనే జీవిస్తుందనుకొని దానికి గాలిమేపరి అని పేరు పెట్టారు.



—ఫ్యాక్టరీల కప్పులు ఈ బొమ్మలోలాగ వుండడానికి కారణము వెలుతురు బాగా అందడానికే. రెండేసి గీతలవల్ల సూచించినవి గాజుపలకలు. వీటివల్ల ఫ్యాక్టరీ అంతటికీ వెల్తురు బాగా అందుతుంది. అవసరానికి తగినట్టు భవనాలు నిర్మించాలనడానికి ఇది చక్కని ఉదాహరణము. ●

—దేవతలూ దయ్యాలూ పూనుట అనగా నేమి?

ఈ ప్రశ్నను పరీక్షచేసిన వారెవరూ లేరు. కాబట్టి ఇప్పటికిప్పుడు తోచిన జవాబు ఇస్తాను. ఈ 'పూనుట'లు ఆ దేవతలూ దయ్యాలూలో నమ్మకమున్న వారికి గాని జరగవనుకుంటాను. దయ్యము పట్టిన వారికి కొంతకాలమువరకూ ఆ దయ్యము (దగ్గరకు రాక) దూరమునుంచే ఝడిపించడమూ, ఆతరవాతే ఆ దయ్యము పట్టడమూ జరుగుతుంది గమనించండి. ప్రారంభ దశలో "అది (ఆ దయ్యము) ఇక్కడ నిలబడి పలకరించిందీ, అక్కడ నిలబడి భయపెట్టిందీ" అని ఊహాబలమువల్ల జడిసిన వారికే చివరికి ఆ దయ్యము పట్టినట్లు వింటాము. ఇది పూర్తిగా పగటికలే అని నమ్ముతాను నేను. చంటిపిల్ల గుణమువచ్చిన బిడ్డని పైకి ఎగరవేస్తే, ఈ జబ్బుకంటె బలవంతమైన స్వరక్షణానైజము మేలుకుని ఆ బిడ్డకి స్మారకము తెప్పించినట్లే దయ్యము పట్టినవారిని చింతబరికెతో బాదినప్పుడు అసలు మనిషి బాధ ఈ దయ్యము పట్టినదన్న గట్టి నమ్మకాన్ని చెదరగొట్టి దయ్యము పోయిందనే నమ్మకము కలిగిస్తుందని నమ్ముతాను నేను. దయ్యాలు పట్టుననే నమ్మకములేని జాతులలో దయ్యాలు పట్టవు.

పూనుటలు కూడా ఇలాంటివే. మహమ్మదీయులకు గానీ, క్రైస్తవులకు గానీ మన దేవతలు పూనవెందుచేత? లింగములను బద్దలు కొట్టి, కాలుకింద తొక్కినిక్కినవారికి ఏడిసి కొట్టదేమి? అమ్మవారు నెత్తిమీద కాలు పెట్టిన సాయేబు నేమీ చెయ్యలేక పూజారిపై కోపించినదట, "ఈ కాలు తీయించేస్తావా? నిన్ను శపించనా?" అని! నమ్మకమున్నవారికే దయ్యాలూ, దేవతలూను. ఇతరులకు లేవు.

—ఉప్పూ పులుపూ తింటే ఆశలెక్కువుంటాయా? అవును. ఆశలు మనస్సుకెలాగో, రుచులు నాలికకలాగ. నాలికని కట్టుకోలేనివారు ఆశల్ని కట్టుకోలేరు. నాలికని స్వాధీనములో ఉంచుకోవడము బ్రహ్మచర్యానికి అవసరమని అనుభవజ్ఞులు చెప్తారు.

—ఏనుగు వెలగపండు తినికాయ పళంగా విసర్జిస్తుందన్నమాట నిజముకాదు.

—నశించిపోయే శరీరానికే గోళ్లుంటాయి కాని శరీరాన్ని విడిచిపోయే 'దయ్యాని'కి గోళ్లెక్కడివి? గోళ్లే లేనప్పుడు బరకడమనగా ఏమిటి?

—మానవుడుగా అవుటకు ఎన్నిదశలు చెందేడు? మొట్టమొదటిది ఏది?

మానవుడుగా అవుటకు చెందిన దశలన్నీ ఇప్పుడు జంతురూపంలో లేనేలేవు. మరి ఇన్ని దశలని చెప్పడము ఎలాగ? జీవము ఒక్క కణముగా వుండిన దశనుంచి మానవుడుగా తయారయ్యేవరకూ పొందిన దశలు, చెట్టుయొక్క మొదలునుండి కొసవరకూ పోయే కాండమువలెనూ, పుట్టిన చోటినుంచి సముద్రము వరకూపోయే నదివలెనూ, నిరంతరాయములు. మనకు కనబడే జంతుజాలములన్నీ జీవ పరిణామమనే కాండమునుంచి వేరైపోయి విలక్షణముగా పెరిగిపోయిన జీవములు. మానవుడు వికాసము పొందినది ఈ కనబడే రూపములద్వారా కానేకాదు. ఈ కనబడే ప్రాణుల తొలి రూపాలన్నీ మానవుని వికాసమనే నది పొడూగునీ వుండిన రేవులు. ఈ కనబడే ప్రాణులన్నీ ఆ నదినుంచి వేరైపోయి సుదూరము సాగిపోయిన శాఖలు.



# బొమ్మరిల్లు

## “ప్రకృతి: పాప



రచన: “అంతర్వాణి”

మేఘపు మెత్తని పొత్తిలియందే
మెరపుల బాలా మెదిలిందో!
మబ్బుల పరదా పురిటింట్లో, చిఱు
గజ్జెల కాలూ కదిలిందో!......

చక్కని పున్నమి వెన్నెల రాతిరి
చిన్నారికూనా నవ్వేను;
చల్లని, తెల్లని, మంచుల పాలే
'అల్లరి బాబూ' త్రావేను.........

తుమ్మల రెమ్మల నుయ్యాలనూగే
గిజిగా! నీవు రావాలి
పాటపాడినా నిద్దుర పోవని
పాపను హాయిగ నూపాలి........

కోడె దూడ, పరిగెత్తే నాటికి
బుజ్జాయీ పారాడాలి.
కోయిల'కూ' యని కూసేనాటికి
పాపాయీ మాటాడాలి.........

వేసగి యెండల చిఱచిఱ లోనే
చేసేవబ్బా! మారాము;
విచ్చిన పూవుల తావులవలెనే
చిలికేవయ్యా! గారాము......



# 1

ఇది 1590 వ సంవత్సరం. ఆస్ట్రియా దేశం ప్రపంచంతో సంబంధం లేకుండా మడికట్టుకుని కూర్చున్నట్టు దూరంగా ఉండి నిద్రపోతోంది. ఆస్ట్రియాలో ఇంకా మధ్యయుగాల నాగరికతే[1] నడుస్తోంది. అప్పటి పరిస్థితి చూస్తే మధ్యయుగాల నాగరికత ఆస్ట్రియాలో శాశ్వతంగా తిష్ఠవేసుకుని కూర్చునేట్లు కనిపిస్తోంది. కొందరు ఆస్ట్రియాలో కాలమానం కొన్ని శతాబ్దాలు వెనకబడివుందనీ, మానసికంగాను ఆధ్యాత్మికంగాను ఆస్ట్రియా ఇంకా విశ్వాసవాదయుగం[2]లోనే ఉందనీ అనేవారు. విశ్వాసవాదయుగం అంటే వారి ఉద్దేశ్యంలో భూషణమే కాని దూషణం కాదని గుర్తుంచుకోవాలి. కనీసం మేమంతా దాన్ని భూషణగానే జమకట్టాం; ఇంకా ఆ యుగంలోనే ఉన్నందుకు గర్వించాం కూడా. నేనప్పటికి బాలుణ్ణయినా అదంతా నాకు బాగా జ్ఞాపకం ఉంది.

అవును; ఆస్ట్రియా దేశం ప్రపం[illegible] దూరంగా ఉండి నిద్రపోతోంది. మా ఊరు ఆస్ట్రియాకి సరిగా మధ్యలో ఉండటంచేత మరీ గాఢంగా నిద్రపోతోంది. చుట్టూ కొండలు, అడవులు; వాటి మధ్య శాంతంగా, ఏకాంతంగా నిద్రపోతోంది మా గ్రామం. మిగతా దేశాల్లో జరిగే సంఘటనల వార్తలేవీ వచ్చి మా గ్రామపు గాఢనిద్రనీ, స్వప్నాలనీ చెదరగొట్టేవి కావు. ఆ వార్తలు రాని లోటుకూడా ఉండేది కాదు.

మా ఊరికి ఒకపక్కన ఒకనది ప్రశాంతంగా ప్రవహించేది; నదిమీద ఆకాశంలో సోమరిగా తిరుగాడే తెలి తెలిమబ్బుల ప్రతిబింబాలు, మెల్లిగా కదిలిపోయే పడవల ప్రతిబింబాలు కనిపించేవి. ఇంకొక పక్కన అడవులుండేవి. అడవుల చివర ఒక పెద్ద కొండ శిఖరం; శిఖరంమీద ఒక పెద్దకోట; కోట గోడలనిండా,. బురుజులనిండా అల్లిబిల్లిగా పెరిగిన ద్రాక్షలతలు. నది ఆవల దూరంగా ఎడమవైపున సూర్యరశ్మి చొరకుండా దట్టంగా చెట్లు పెరిగిన పర్వతశ్రేణి. కుడివైపున నదిమీదికి వంగిచూస్తున్న పర్వతశిఖరం. ఈ పర్వతశిఖరానికి, ఆ పర్వతశ్రేణికీ మధ్య విశాలమైన మైదానం; మైదానం మధ్య చెదురుగా చుక్కల్లాగ కనిపించే ఇళ్లు, తోటలు, చెట్ల నీడలు......

కొన్ని మైళ్ళ చుట్టుపక్కలవరకూ ఆప్రాంతం ఒక సామంత రాజు స్వాధీనంలో ఉండేది. కొండ శిఖరం మీద కోట ఆయనదే. ఆయన సేవకులు కోట నెప్పుడూ నివాసయోగ్యంగా, పరిశుభ్రం చేసి ఉంచేవారు. కాని రాజుగారు కాని, ఆయన కుటుంబీకులు

(1) మధ్య యుగాలనాటి నాగరికత:— యూరప్ ఖండ చరిత్రని వాళ్ల చరిత్రకారులు మూడు పెద్ద భాగాలుగా విభజించారు; ప్రాచీన యుగం, మధ్యయుగం, నవీన యుగం అని. ప్రాచీనయుగంలో బానిసల పద్ధతి ఉండేది. మధ్య యుగంలో భూస్వామ్య పద్ధతి ఉండేది. నవీన యుగంలో పెట్టుబడిదారీ పద్ధతి ఉన్నది. మధ్య యుగంలో చర్చి, చక్రవర్తి, సామంతులు సామాన్య జనం మీద నిరంకుశాధికారం చెలాయించేవారు. ఈ యుగం బ్రిటన్, ఇటలీ మొదలైన దేశాల్లో పదిహేనవ శతాబ్దాంతంతో ఆఖరై, నవీన యుగం ప్రారంభమైంది.

(2) విశ్వాసవాద యుగం:- మధ్యయుగ నాగరికత శిఖరాలనందుకున్న కాలంలో విశ్వాసవాదం ప్రబలంగా ఉండేది. ఈ వాదం ప్రకారం ప్రజలు ఏ విషయాన్ని ప్రశ్నించగూడదు; పరిశోధించగూడదు; ఇదంతా భగవంతుడి సృష్టి అని, మొదటినుంచీ ప్రపంచం ఇలాగే ఉందనీ, చివరిదాకా ఇలాగే ఉంటుందనీ విశ్వసించాలి. అలా విశ్వసించనివాడు భగవద్విరోధి.

## ఉపోద్ఘాతం.

ప్రతి గొప్ప రచయితా నాటకం రాసినా, నవల రాసినా, కావ్యం రాసినా తన రచనలో తన్ను ప్రతిబింబింపజేసుకుంటాడు. ప్రపంచం మీద తన అభిప్రాయమేమిటో ప్రత్యక్షంగానో, పాత్రలద్వారానో చెప్పి తీరుతాడు. మార్క్ ట్వేన్ రాసిన నవలల్లో మార్క్ ట్వేన్ పూర్తిగా కనిపిస్తాడు. అతని గొప్ప నవలల్లో ఒకటైన “Mysterious Stranger”లో సైతాను భాషలో మార్క్ ట్వేన్ మాట్లాడుతూ మానవజాతిమీద, చరిత్రమీద తనకు గల అక్కసునంతా తీర్చుకుంటాడు. ఈనవలలో మార్క్ ట్వేన్ హృదయం లేని సైతానులాగ కనిపించినా, ఇప్పటి ప్రపంచ పరిస్థితిలో—మన గతి చరిత్రలో గర్వపడాల్సిన కారణాల కంటే సిగ్గుపడాల్సిన కారణాలే ఎక్కువగా ఉన్నాయనే సంగతి జ్ఞాపకం చేసుకోవడం కోసం ఈనవల చదివితీరాలి. మార్క్ ట్వేన్ ఈ పుస్తకంలో తన జీవితవేదాంతాన్ని మానసికంగా బాల్యం వదలని పెద్దవాళ్లకీ, భౌతికంగా బాల్యం వదలని చిన్నవాళ్లకీ కూడా ఇంపుగా ఉండేట్లు చక్కని కథరూపంలో రాశాడు.

★ అనువాదం: శ్రీ నండూరి రామమోహనరావు ★



# విచిత్ర వ్యక్తి



గాని, ఎప్పుడూ అక్కడ ఉండేవారు కాదు. ఎప్పుడో అయిదేళ్ల కొకసారి వచ్చి కొన్నాళ్లుండిపోయేవారు. పరివారసమేతుడై రాజుగారు కోటలో విడిది చెయ్యటానికి వస్తే, జగదీశ్వరు డెవడో వచ్చినట్టు, ప్రపంచ సామ్రాజ్యాల వైభవాల నన్నిటినీ వెంటబెట్టుకుని వచ్చినట్లు సందడి అయ్యేది. ఆయన వెళ్ళిపోగానే మద్యపాన మహోత్సవం తర్వాత నీరసవాతావరణం ఏర్పడ్డట్టు నీరవంగా ఉండేది.

మా గ్రామనామధేయం ఈజెల్‌డార్ఫ్; మా కుర్రాళ్లకి అది స్వర్గసన్నిభంగా ఉండేది. అట్టే బడి బాధ ఉండేదికాదు. బళ్లో మాకు చెప్పేదల్లా, క్రైస్తవ ధర్మాలు తూచా తప్పకుండా పాటించాలనీ, ఏసుక్రీస్తు తల్లిఅయిన మేరీకన్యను పూజించాలనీ, చర్చినీ, క్రైస్తవ భగవద్భక్తులను గౌరవించాలనీ—ఇంతే. ఇంతకంటే మాకు బళ్లో ఇంకేమీ నేర్పేవాళ్లు కాదు. అసలు నేర్చుకోటానికి అధికారం కూడా లేదు. ఆరోజుల్లో ఆనవాయితీప్రకారం మామూలుజనానికి విజ్ఞానం కలిగించకూడదు. ప్రజలు విజ్ఞానవంతులైతే తమ స్థితిగతుల మీద అసంతృప్తి కలుగుతుంది; ప్రజల్ని ఈ విధంగాసృష్టించిన భగవంతుడు తన సృష్టివిధానం మీద ప్రజలకు అసంతృప్తి కలగటం సహించడు.

మా గ్రామానికి ఇద్దరు మతగురువు లుండేవారు. ఒకాయనపేరు ఫాదర్ అడాల్ఫ్. ఈయనకి క్రైస్తవమతంమీద చాలా శ్రద్ధాప్రపత్తు లుండేవి. చాలా చెమట ఖర్చుచేసి ప్రజలికి నీతులు బోధించేవాడు. మతగురువుగా ఫాదర్ అడాల్ఫ్‌కంటే సమర్థులైనవా ళ్ళుంటే ఉండవచ్చు; కాని ప్రజలు ఆయన పట్ల చూపించేటంత భయభక్తులు ఇంకెవరిమీద చూపించలేరని ఘంటాపథంగా చెప్పగలను. దీనికి ఒక కారణం ఉన్నది: ఫాదర్ అడాల్ఫ్‌కి సైతానుకి అంటే బొత్తిగా భయంలేదు. సైతాను అంటే భయపడని క్రైస్తవుడు నే నెరిగినంతవరకూ ఆయ నొక్కడే. ఆయన ధీమా చూసి, ఆయన దగ్గరేవో మంత్రసిద్ధు లుండి ఉండాలనీ, లేకపోతే సైతానుపట్ల అంత నిర్లక్ష్యంగా సంచరించలేడనీ ప్రజలకి ఒక గట్టి నమ్మకం ఏర్పడింది.

సాధారణంగా సైతాన్ని బూతులు తిట్టనివాళ్లెవరూ ఉండరు; కాని ఆ తిట్టడంలో కూడా సైతానంటే భక్తీ, భయం, గౌరవం చూపిస్తారు కాని ఇష్టం వచ్చినట్టు మనసారా తిట్టరు. ఫాదర్ అడాల్ఫ్ అట్లాకాదు; సైతాన్ని నోటికొచ్చిన తిట్లల్లా తిట్టేవాడు. ఆ తిట్లు వింటుంటే వినేవాళ్ళకి గుండెలు పీచుపీచుమనేవి. ఆయన సైతాన్ని గడ్డిపోచ కింద లెక్కకట్టి వేళాకోళం చేసేవాడు. వినేవాళ్లు కళ్లుమూసుకుని శిలువను స్మరించుకుని తొందరగా అక్కణ్ణించి తప్పుకునేవారు; లేకపోతే ఏదో భయంకరమైన పని జరుగుతుందని వాళ్ల భయం.

ఫాదర్ అడాల్ఫ్ సైతాన్ని ముఖాముఖి అనేక సార్లు కలుసుకున్నట్టు, కలుసుకున్నప్పుడల్లా "పోవోయ్ నీ లెక్కేమిటి?" అని నిర్లక్ష్యం చేసినట్లు ప్రతీతి. ప్రతీతి ఏమిటి—ఫాదర్ అడాల్ఫ్ స్వయంగా అలాగని చెప్పేవాడు. ఆయన చెప్పింది నిజమేననటానికి కనీసం ఒక ప్రబల సాక్ష్యం ఉంది: ఒకసారి ఆయన తన గదిలో ఉండగా సైతాను వచ్చాడు. ఫాదర్ అడాల్ఫ్ సైతానుతో చాలాసేపు యుద్ధంచేశాడు. యుద్ధం చేస్తూచేస్తూ చేతులో ఉన్న సారాసీసా సైతానుమీదికి విసిరేశాడు. విసిరేశాడనటానికి నిదర్శనంగా తెల్లటిగోడమీద ఎర్రటిమరక, పగిలిన సీసా తాలూకు ముక్కలు ఈనాటికీ ఉన్నాయి.

మా రెండో మతగురువు ఫాదర్ పీటర్. ఆయనంటే మా అందరికీ ప్రేమ. ఆయనమీద కొందరు కిట్టనివాళ్లు ఒక అపనిందవేశారు: భగవంతుడు ప్రేమస్వరూపుడని, తన పుత్రులైన మానవు లందరినీ పాపాత్ములు, పుణ్యాత్ములు అనే విచక్షణ లేకుండా చివరికి తన దగ్గిరికి చేర్చుకుంటాడని ఫాదర్ పీటర్ ఎవరితోనో ఎప్పుడో అన్నట్టు ఒక అపవాదు లేవదీశారు

---

(3) సైతాను:— క్రైస్తవమత గ్రంథాల్లో సైతాను అనబడే వాడు దేవుడిమీద తిరుగుబాటుచేసి ఓడిపోయి నరకంలోకి తోసివేయబడిన ఒక మహాపాపి. నరకంలో పడిపోయినా సైతాను అప్పుడప్పుడు భూలోకంలోకి వచ్చి మానవులను వశపరచుకొని, వాళ్ళచేత పాపాలు చేయించి, వాళ్ళు స్వర్గానికి పోకుండా నరకంలో పడేట్టుచేసి, ఆ విధంగా దేవుడిమీద కసితీర్చుకుంటూ ఉంటాడు. పుణ్యంచేసే మనిషి భగవద్భక్తుడనీ, పాపం చేసే మనిషి సైతాను భక్తుడనీ క్రైస్తవుల నమ్మకం.

నిజానికి ఆయనా మాట అనివుంటే అది ఘోరమైన మాటే. కాని ఫాదర్ పీటర్ ఆ మాట అన్నట్టు ఋజువు లేదు. అలా అనే మనిషి కూడా కాడాయన. ఇలాంటి అబద్ధాలు ఆయన ఎప్పుడూ చెప్పడు. ఎంతో మంచి మనిషి. ఆ మాట చర్చిలో ప్రార్థనసభలో ఆయన అన లేదు. అనిఉంటే నలుగురూ అప్పుడే ఆ విషయం బయటపెట్టేవారు. బయట ఎక్కడో ఎప్పుడో ఎవరితోనో ఏ సందర్భంలోనో అన్నాట్ట. అన్నాడని కిట్టనివాళ్లు తేలిగ్గా కల్పించి ఉండవచ్చు. ఫాదర్ పీటర్ అంటే కిట్టనివాడొకడే ఉన్నాడు. అతడు మా వూరి జ్యోతిష్కుడు. ఊరిబైట పాడుపడిన గోపురగృహంలో ఉంటాడు. ఎప్పుడూ బయటికి రాడు. రాత్రిళ్ళు గోపురం చిటారున కూర్చుని నక్షత్రాలు శోధిస్తూ ఉంటాడు. అతడు యుద్ధాల్ని గురించి, కరువుల్ని గురించి జోస్యం బాగా చెప్పగలడు. అదేమంత కష్టం కాదనుకోండి. ఎందుకంటే ఎక్కడో అక్కడ ఎప్పుడూ యుద్ధం జరుగుతూనే వుంటుంది, క్షామం తాండవిస్తూనే వుంటుంది. కాని అతడు మంచి జ్యోతిష్కుడనటానికి కారణమేమిటంటే ఆయన దగ్గిరొక పెద్దగ్రంథం ఉంది. దాని సహాయంతో ఎవరి జాతకమైనా చెప్పగలడు; పోయిన వస్తువు లెక్కడున్నాయో ఖచ్చితంగా చెప్పగలడు. గ్రామంలో ఫాదర్ పీటర్ తప్పిస్తే జ్యోతిష్కుడంటే భయపడని వాడు లేడు. ఆ జ్యోతిష్కుడు గోపురందిగి పొడుగాటి టోపీ, నక్షత్రాల గుర్తులున్న వదులు అంగరఖా, ఒక చేతులో జ్యోతిషగ్రంథం, మరొక చేతులో మంత్రదండం ధరించి గ్రామవీథుల్లో నడుస్తూఉంటే, సైతానుతో దెబ్బలాడిన ఫాదర్ అడాల్ఫ్‌లాంటి నిర్లక్ష్యపు మనిషి కూడా వళ్లు దగ్గిర పెట్టుకుని మెలిగేవాడు.

ఫాదర్ పీటర్ మాత్రం జ్యోతిష్కుణ్ణి లెక్కచేసేవాడుగాదు. వట్టి మోనగాడనీ, మూర్ఖుడనీ నిరసించేవాడు. ఇలా నిరసించడంవల్ల జ్యోతిష్కుడికి ఫాదర్ పీటర్ మీద సహజంగా ద్వేషం కలిగింది. ఫాదర్ పీటర్ మీద అపవాదు వేసింది జ్యోతిష్కుడేననీ, అతడే ఆ ముక్క పైమతాధికారి దాకా చేరవేసి వుంటాడనీ మేమంతా అనుకున్నాం. భగవంతుడు ప్రేమస్వరూపుడని ఫాదర్ పీటర్ తన తమ్ముడు కూతురైన మార్గరెట్‌తో అన్నాడని పెద్ద మతాధికారికి ఫిర్యాదు చేయబడింది. తన పెత్తండ్రి ఆ ముక్క అన లేదని, ఆ ముసలాయనమీద కరు[illegible] వలసిందని మార్గరెట్ ఎంత మొత్తుకున్నా పెద్ద మతాధికారి వినిపించుకోలేదు. ఫాదర్ పీటర్‌ను ఉద్యోగం నుంచి తొలగించాడు. అసలు వెలివేసేవాడేకాని, వెలివెయ్యటానికి తగినంత సాక్ష్యం దొరకనందున మతాధికారి అక్కడితో ఊరుకున్నాడు. ఫాదర్ పీటర్‌కు మతగురువు ఉద్యోగంపోయి రెండేళ్లయింది. ఆ ఉద్యోగం కూడా ఫాదర్ అడాల్ఫ్‌కే లభించింది.

ఉద్యోగంపోయిన తర్వాత ఫాదర్ పీటర్‌కూ, మార్గరెట్‌కూ చాలా గడ్డురోజులు సంప్రాప్తమైనాయి. అంతకుముందు గ్రామంలోవారు వారిద్దరినీ ఎంత గౌరవించారో ఇప్పుడంత హీనంగా చూడసాగారు. వారి స్నేహితులంతా దూరదూరంగా తొలగిపోసాగారు. ఉద్యోగం పోయేనాటికి మార్గరెట్‌కు పద్దెనిమిదేళ్ళు. అంత చక్కని అమ్మాయి మా వూళ్లో లేదు. పైగా మంచి తెలివితేటలుకల పిల్ల. కొందరు విద్యార్థులను కూడదీసి ఫిడేలు నేర్పేది. ఆవిధంగా ఇంటి ఖర్చులకి సరిపోయే డబ్బు కష్టపడి ఆర్జించేది. కాని ఫాదర్ పీటర్‌కు ఉద్యోగంపోయి, అవమానంపాలైన తర్వాత విద్యార్థులు క్రమంగా తగ్గిపోసాగారు. ఇప్పుడసలు వారిఇంటికి ఎవరూ వెళ్లటమే మానేశారు. గ్రామంలో యువతియువకులు నృత్యోత్సవాలు, విందులు చేసుకునేటప్పుడు మార్గరెట్‌ను పిలవటం మానేశారు. ఇదివరకు ఆమెచుట్టూ తుమ్మెదల్లాగ ఝుమ్మంటూ మూగే యువకులు ఇప్పుడామె ఛాయలకే రావటం లేదు — విల్హెల్మ్ మీడ్లింగ్ అనే యువకుడు తప్ప. మార్గరెట్, ఆమె పెత్తండ్రి, స్నేహితులకు, బంధువులకు దూరమై ఒంటరిగా, చీకాకులో, చీకటిలో, చేత చిల్లిగవ్వయినా లేని దరిద్రస్థితికి వచ్చారు. గుడ్డలు చిరిగిపోయాయి; రోజుకొక రొట్టెకూడా కొనలేని గతి పట్టింది. ఇంటియజమాని సాలమన్ ఐజాక్స్ ఇంట్లో నుంచి వెళ్లగొట్టేస్తానని తీవ్రంగా బెదిరించటం కూడా ప్రారంభించాడు.

## 2

వేము ముగ్గురం బాలురం మాత్రం ఎప్పుడూ ఒకరి నొకరం విడవకుండా స్నేహంగా తిరిగే వాళ్లం. పసి పిల్లలంగా ఉన్నప్పటి నుంచీ మాకు స్నేహం కలిసింది. ఏళ్లు గడిచిన కొద్దీ మా మైత్రి

# ★ విచిత్ర వ్యక్తి ★

గాఢమైంది. ఒకడిపేరు నికొలాస్ బామన్; జడ్జీగా రబ్బాయి. రెండోవాడి పేరు సెప్పీ వోల్మ్యెయర్; ఒక పెద్ద హోటల్ యజమానికొడుకు. మూడో వాణ్ణి నేను. నా పేరు తియొడోర్ ఫిషర్; మానాన్న చర్చిలో పియానో వాద్యగాడు.

మేము ముగ్గురం ఆచుట్టు పక్కల కొండల్లోను, అడవుల్లోను విసుగూ విరామం లేకుండా విహరించే వాళ్లం. అక్కడి ప్రతిచెట్టూ, ప్రతిగుట్టా, ప్రతిపుట్టా మాకు గుర్తే. తీరిక లభించినప్పుడల్లా — అంటే ఈదులాడటం, పడవలో షికారు వెళ్లటం, చేపలు పట్టడం, మంచు మీదనో, కొండ వాలుల్లోనో ఆటలాడటం— మొదలైన జరూరు పనులేమీ లేనప్పుడల్లా అడవుల్లోనే తిరిగే వాళ్లం.

మిగతా కుర్రాళ్లకంటే మాకు ప్రత్యేకంగా ఉన్నఘనత ఏమిటంటే కొండమీది కోటలోని తోటలో స్వేచ్ఛగా ఆడుకోటానికి మాకు హక్కుండేది. కోటలోని ముసలి సేవకుడొకడు మాకు స్నేహితుడు. అతడు మమ్మల్ని యథేచ్ఛగా తోటలో ఆడుకో నిచ్చేవాడు. రాత్రిళ్లప్పుడు మాకు పూర్వకాలపు కథలు, ఏవేవో వింతలు చెపుతూ కాలక్షేపం చేసేవాడు. మాకు పొగతాగటం నేర్పింది అతనే. అప్పుడప్పుడు కుండపోతగా వాన కురిసేది. అలాంటి సమయాల్లో ఆ రాత్రికి కోటలోనే ఉండిపోయే వాళ్లం. కోటబయట కొండమీద తొండాలతో కుమ్మరించినట్టు వాన కురుస్తూ, మెరుపు మెరుస్తూ, ఉరుము ఉరుముతూ ఉంటే మేము లోపల వెచ్చగా పొగ తాగుతూ మా వృద్ధస్నేహితుడు చెప్పే వింత కథలు వింటూ కూర్చునే వాళ్లం. ముఖ్యంగా దెయ్యాలు, యుద్ధాలు, హత్యలు, చిత్రవధలు వీటిని గురించిన భయంకర కథలు అతడు చెబుతుంటే చెవులు నిక్క బొడుచుకుని ఆసక్తితో వినేవాళ్లం. వృద్ధుడు ఎక్కువగా తన అనుభవాలే వర్ణించేవాడు. ఎన్నోసార్లు దెయ్యాల్ని, మంత్రగత్తెలని[4] ఇంద్రజాలికులను అతడు చూశాట్ట. ఒకసారి కొండల్లో తిరుగుతుండగా తుపాను వచ్చిందట. అప్పుడు ఒక మెరుపు మెరిసి గాలిలో ఈదులాడుతూ, జడలు విరబోసుకుని పోతున్న దెయ్యాల గుంపులు కనిపించాయట. ఇంకా ఎన్నోసార్లు దెయ్యపు గబ్బిలాలు చూశాట్ట. ఈ గబ్బిలాలు మనుషుల్ని బలే చిత్రంగా చంపుతాయట. మనుషులు నిద్రపోతున్నపుడు పక్కమీద వాలి, మెలుకువ రాకుండా చల్లగా రెక్కలతో విసురుతూ మెడమీద కరిచి నెత్తురు పీల్చివేస్తూ చంపుతాయట.

వృద్ధుడు మాకు దెయ్యాల భయం పూర్తిగా పోగొట్టాడు. దెయ్యాలు మనుషుల్ని ఏమీ చెయ్యవని, పాపం వాటితో మాట్లాడే వాళ్లెవరూ లేక అలా ఒంటరిగా దిగులుగా ఏడుస్తూ భూలోకంలో తిరుగుతూ ఉంటాయనీ, వాటికి కావలసిందల్లా ప్రేమతో కూడిన ఒకమాట, ఒక చిరునవ్వు మాత్రమేననీ చెప్పేవాడు. మాకు అతని మూలంగా ఎంత ధైర్యం కలిగిందంటే, అతనితో కలిసి కోట వెనకాల భూగృహాల చీకట్లోకి కూడా నిర్భయంగా వెళ్ళేవాళ్లం. భూగృహంలో ఒక్కసారి మాత్రమే దెయ్యం కనిపించింది. ఆ దెయ్యం మసక మసకగా పొగలాగ దూరంగా తప్పుకుపోయింది. దాన్ని చూసి మేము రవ్వంతైనా చలించలేదు. ఈ దెయ్యం తన్ను, చాలాసార్లు నిద్ర లేపిందనీ, కాని ఎటువంటి హాని చెయ్యలేదనీ వృద్ధుడు చెప్పాడు. అన్నిటికంటె గొప్ప సంగతి ఇంకోటున్నది. వృద్ధుడు అనేకసార్లు నాతొత్తు స్వర్గం నుంచి దిగివచ్చిన దేవకన్యల్ని చూశాట్ట. దేవకన్యలకి రెక్కలు లేవట; బట్టలు తొడుక్కున్నారట; వాళ్లు తనతో మామూలు మనుషుల్లాగే శుభ్రంగా మాట్లాడారట. దేవకన్యలు దెయ్యాల మాదిరిగా కాక చాలా సంతోషంగా, మందహాస ముఖాలతో కనిపించారట.

అది మేనెల. ఆకిందటి రాత్రి మా వృద్ధ

---

(4) మంత్రగత్తెలని ఇంగ్లీషులో *Witches* అంటారు. సైతానుతోను, అతని తాలూకు భూతాలతోను సంబంధబాంధవ్యాలేర్పరుచుకుని వాళ్ళద్వారా కొన్ని శక్తులు సంపాయించి వాటిని మనుషులమీద ప్రయోగించే స్త్రీలని మంత్రగత్తెలంటారు. ఈ మంత్రగత్తెలు చర్చికి విరోధులు. మధ్యయుగ దినాలలో మంత్రగత్తె అని అనుమానం కలిగిన ఏ స్త్రీనైనా నిర్దాక్షిణ్యంగా పట్టుకుని నిలువునా నిప్పంటించి చంపేసేవారు.

మిత్రుడు చాలా దెయ్యాల కథలు చెప్పాడు. పొద్దున్నే లేచి అతనితో కూర్చుని భోజనంచేసి కొండ కిందికి వెళ్ళాము. నదిపైన వంతెన దాటి, ఎడమవైపున గల కొండ లెక్కి, చెట్లతో నిండిన ఒక శిఖరం మీద కూర్చున్నాము. ఈ శిఖరం మా ఆటస్థలం. సాధారణంగా ఇక్కడికే వచ్చి కూర్చుంటూ ఉంటాము. పచ్చికమీద కాళ్లు జాచుకుని పడుకుని, పైపు కాలుస్తూ, మాకు రాత్రి వృద్ధుడు చెప్పిన వింత కథను గూర్చి చర్చించాలని అనుకున్నాం. కాని పైపు కాల్చటానికి వీల్లేక పోయింది. చెకుముకి రాయి, ఉక్కుముక్క వెంట తెచ్చుకోవటం మరిచిపోయి నందుకు చాలా విచారం కలిగింది.

ఇంతలో ఎక్కడి నుండి వచ్చాడో ఏమో ఒక యువకుడు చెట్ల మధ్యనుండి మా కేసి నడిచి వచ్చాడు. మాపక్కన కూర్చుని, ఎంతో కాలంనుంచీ మమ్మల్ని ఎరిగిన వాడల్లే స్నేహంగా మాట్లాడ సాగాడు. మేము మాత్రం అతనితో మాట్లాడ లేదు. అతడెవరో కొత్తవాడు. కొత్తవాళ్లతో వెంటనే దోస్తీ కలిపించుకుని మాట్లాడటం మా కలవాటు లేదు. కొత్త బట్టలు, ధగధగ మెరిసేవి, కట్టుకున్నాడు; మంచి అందంగా ఉన్నాడు. ఆ తేజోవంతమైన ముఖం, ఎంత విన్నా వినబుద్ధి వేసే కంఠస్వరం, ఒక రకమైన సౌకుమార్యంతో కూడిన ఠీవి—ఇవన్నీ చూసి అతనితో నేస్తం కలపాలని అనిపించింది. కాని ఎలా మొదలు పెట్టాలో తెలియ లేదు. ఇంతలో నాకు పైపుజ్ఞాపకం వచ్చింది. పైపు తీసి ఇద్దామను కున్నాను గాని దగ్గిర నిప్పులేదు గదా అని మళ్లీ జ్ఞాపకం వచ్చి మానేశాను. వెంటనే ఆ అపరిచిత యువకుడు నాకేసి చూసి మందహాసం చేసి,

"నిప్పుకావాలా? దానికే ముంది? నిమిషంలో తయారు చేస్తాను," అన్నాడు.

పట్టశక్యంకాని ఆశ్చర్యం నన్ను ఉక్కిరిబిక్కిరి చేసింది. నేను ఇంతవరకూ అతనితో ఒక్క మాట మాట్లాడ లేదు. పైపు తీసి ఇద్దామని, నిప్పులేక పోతే పైపు మాత్రం ఇవ్వటం దేనికని, ఇదంతా నాలో నేను అనుకున్నానే గాని పైకి అన లేదు. ఇంతలో అతనే నిప్పుకావాలా అని అడగటం ఎంత ఆశ్చర్యకరం! ఆతడు నా చేతులో పైపు తీసుకుని పొగాకుమీద మెల్లిగా ఉదాడు. వెంటనే పొగాకు అంటుకుంది. నీలపు పొగ సుడిగుండంలో అలల్లాగ గిరగిర తిరుగుతూ పైకి లేచింది. ధన్ మని ముగ్గురం లేచి ముందుకు దూకి పరిగెత్త బోయాము. కాని కొత్త యువకుడు పారిపోవద్దనీ, మాకేమీ హాని చెయ్యనని బతిమాల సాగాడు. మాతో చెలిమి చెయ్యటానికే వచ్చాననీ, మేమంటే తనకెంతో ఇష్టమనీ అన్నాడు. ఆమాటలు విని ఉన్నచోటే ఆగిపోయాము. వెనక్కి వెళ్లటానికి ఒక వంక భయమూ, ఈవింత ఏమిటో పరిశీలించాలని మరొక వంక ఆసక్తి—ఈ రెంటితోనూ ఎటూ కదలలేక నుంచున్నాము. యువకుడు ఇంకా బతిమాలుతూనే ఉన్నాడు పారిపోవద్దని. పొగాకు అంటుకుని కాలుతున్నప్పటికీ పైపు తాపున బద్దలై పోవటం, భూమి కంపించటం, పిడుగులు పడటం, మొదలైన వేమీ జరగనందున మాకు భయం తీరింది. నెమ్మదిగా కాస్త కాస్త వెనక్కి వచ్చి అతని దగ్గిరే నుంచున్నాము—అవసరమైతే పారిపోటానికి సిద్ధంగా.

మా భయం, అనుమానం తీర్చటానికి అతడు ఎంతో మృదువుగా, మధురంగా కబుర్లు చెప్పాడు. అంత తియ్యటి కంఠం నే నెప్పుడూ విన లేదు. అతని ముఖంలో ఎంతో మంచితనం కనిపించింది. మరి కొద్ది నిమిషాల్లో మేము మాకు తెలియకుండా నే అతని పక్కన కూర్చుని నిర్భయంగా మాట్లాడ సాగాము. కొత్త స్నేహితు డొకడు దొరికినందుకు సంతోషం కలిగింది. బెరుకూ, కొత్తా తీరి పూర్వ పరిచితుల మల్లే మాటా మాటా కలిపిన తర్వాత నెమ్మదిగా అడిగాము: పొగాకుమీద ఊదినంత మాత్రానే నిప్పు ఎల్లా తెప్పించ గలిగావని. అతడు అది కొత్త విద్యేమీ కాదన్నాడు. తనకు స్వతహాగా వచ్చిన విద్యే నన్నాడు. ఇదేకాదు, ఇల్లాంటి వింతా ఎన్నో తమాషాలు తను చెయ్యగల నన్నాడు.

"ఏం తమాషాలు?" అని అడిగాము.

"ఓ, ఏది పడితే అదే చెయ్యగలను. నేను చెయ్యలేనిది లేదు."

"మాకు చేసి చూపిస్తావా?"

"మరి మీరు పారిపోకుండా ఉంటారా?"

"ఊహు. పారిపోము. చెయ్యవూ? తమాషాలు చెయ్యవూ?"

#  విచిత్ర వ్యక్తి 

"చేస్తాను. మీరు మళ్ళీ భయపడి పారి పోకుండా ఉంటే ఎన్నైనా చేసి చూపిస్తాను."

మేము పారిపోమని వాగ్దానం చేశాము. యువకుడు కొంచెం దూరంలో ఉన్న నీటిమడుగు వద్దకు వెళ్లి ఒక ఆకు దొన్నెలో నీళ్లు తీసుకు వచ్చాడు. నీళ్లతో మీద ఇందాకటిలాగే ఊదాడు. నీళ్లు క్షణంలో గడ్డకట్టి మంచులాగ మారాయి. మాకు అద్భుతమనిపించింది, కాని భయం వెయ్యలేదు. ఇంకా తమాషాలు చెయ్యమని అడిగాము. యువకుడు మమ్మల్ని ఇష్టం వచ్చిన పళ్లు కోరుకో మన్నాడు. ఈకాలంలో కాస్తాయా కాయవా అనే విచక్షణ లేకుండా ఏం కావలిస్తే అవి కోరుకో మన్నాడు. మేము ముగ్గురం ఒకేసారి అడిగాం.

"బత్తాయికాయ!"

"ఆపిల్!"

"ద్రాక్షపళ్లు!"

"మీ జేబులో ఉన్నాయి, చూసుకోండి," అన్నాడు యువకుడు. జేబుల్లో చేతులు పెట్టగానే ఎవరు కోరిన పళ్లు వారికి దొరికాయి. అవి తింటే ఎంతో రుచిగా ఉన్నాయి కూడాను. ఇంకా కావా లనిపించింది. కాని మర్యాదగా ఉండదని పైకన లేదు.

"మీకేం కావలిసినా ఇస్తాను. మీరు నాతో ఫలానా ఫలానా ఇది కావాలని చెప్పక్కర్లేదు. మీ పక్క న నే నున్నంతసేపూ మీరు కోరుకోవటం తడవు అన్నీ వచ్చేస్తాయి", అన్నాడు యువకుడు.

రొట్టె, బిస్కట్లు, బిళ్లలు, బాదం కాయలు,— ఏది తలుచుకుంటే అది, ఆక్షణంలో జేబు ఈనినట్టు బయలుదేర సాగాయి. ఆబగా, ఆవురావురుమంటూ వాటిని మేము లగాయించాము. కొత్త యువకుడు మట్టితో చిన్న ఉడత చేసి వదిలిపెట్టాడు. అది పరిగెత్తుకు పోయి చెట్టు కొమ్మమీద కూర్చుని మాకేసి చూసి వెక్కిరించింది. తరవాత ఎలిక పిల్లంత కుక్కనొక దాన్ని చేసి వదిలిపెట్టాడు. అది మొరుగుతూ పోయి చెట్టెక్కి ఉడతను తరిమింది. అలా ఆబల్లి కుక్క ఉడతని చెట్టుమీంచి చెట్టుమీదికి తరుముకుంటూ, చివరకి రెండూ దూరంగా కనుచూపు మేరదాటి పోయాయి. తరవాత మట్టితోనే పక్షులు చేశాడు. అవి రెక్కలల్లార్చి పాడుకుంటూ ఎగిరి పోయాయి.

చివరికి ధైర్యం చేసి అడిగాను: నువ్వెవరివో చెప్పమని.

"నేను దేవతని," అన్నాడు యువకుడు, అదొక చాలా మామూలైన విషయమైనట్టు. అని ఇంకొక పక్షిని నేలమీద పెట్టి, చప్పట్లు కొట్టాడు. అది ఎగిరిపోయింది.

"దేవత" అనగానే ఏదో చెప్పలేని భయం కలిగింది మాకు. కాని భయపడ వద్దనీ, దేవతను చూసి భయపడే అవసరం లేదనీ యువకుడు ధైర్యం చెప్పాడు. మళ్లీ మామూలుగా ఏమీ జరగనట్టు మృదువుగా కబుర్లు చెప్పసాగాడు. చెబుతూనే మట్టితో వేలెడంత మనిషి బొమ్మల్ని బోలెడు చేసి పెట్టాడు. ఆ మనుషుల్లో ఆడవాళ్లూ మొగవాళ్లూ ఉన్నారు. వాళ్లు గబగబ పనులు ప్రారంభించారు. రెండు చదరపు గజాల స్థలం బాగుచేసి దానిమీద ఒక చిన్న కోట కట్టటం మొదలు పెట్టారు. ఆడవాళ్లు సున్నం కలిపి తట్టలతో తీసుకువచ్చి నిచ్చెనల మీద ఉన్న మగవాళ్లకి అందించటం, మగవాళ్లు ఇటుకలు పేర్చి సున్నం మెత్తటం—అచ్చు నిజంగా మనుషులు చేసినట్టే చెయ్య సాగారు. అటువంటి మనుషులు అయిదు వందలమంది అటూ ఇటూ ఏదో గొప్పపని ఉన్నట్టు తిరగటం, చకచక కోట నిర్మాణం పూర్తి చెయ్యటం చూస్తుంటే భయం, బెరుకూ మరిచిపోయి తన్మయులమై పోయాము. "మేము కూడా అలాంటి మనుషుల్ని చెయ్యవచ్చునా?" అని యువకుణ్ణి అడిగాము. చెయ్యవచ్చన్నాడు. సెప్పీని పేరుపెట్టి పిలిచి కోట గోడలమీద పెట్టటానికి ఫిరంగులు తయారు చెయ్యమన్నాడు. నికొలాస్‌ను పేరుపెట్టి పిలిచి సైనికులకు కవచాలు, శిరస్త్రాణాలు, కత్తులు, డాళ్లు తయారు చెయ్యమన్నాడు. నన్ను గుర్రాల్ని, రౌతుల్ని తయారు చెయ్యమన్నాడు. అతడు మమ్మల్ని పేరు పేరునా పిలుస్తుంటే మేం చెప్పకుండా ఎల్లా తెలిసిందా అని మళ్ళీ ఆశ్చర్యం కలిగింది. సెప్పీ ఉండబట్టలేక యువకుణ్ణి "నీ పేరేమి"టని అడిగాడు.

[illegible]
జారి పడబోతున్న ఒక ఆడమనిషిని వుల్లతో ఆపి సరిగా నుంచోబెట్టా "ఈ ఆడమనిషికి ఇంత అజాగ్రత్తేమిటి? కాలుజారి పడితే ఇంకేముం ఉందా?" అన్నాడు.

ఆ పేరు వినగానే మాకు వొళ్లు ఝల్లుమంది. అప్రయత్నంగా మా చేతుల్లోని బొమ్మ ఫిరంగులు, గుర్రాలూ అవి కిందపడి ముక్కలయ్యాయి. యువకుడు అదిచూసి చిరునవ్వు నవ్వుతూ "ఏమిటలా చూస్తారేం?" అన్నాడు. నేను "అబ్బే ఏం లేదు. దేవతలకి అల్లాంటి పేరుంటుందా?" అన్నాను.

"ఎందు కుండ గూడదూ?"

"కాని—ఆ పేరు—అది—దేవుడి విరోధి పేరుగదా?..."

"అవును. అతడు మా బాబయ్యే."

ఈమాట మాకెంత ఆశ్చర్యం కలిగించిందో చూడనట్టు నటిస్తూ విరిగిపోయిన గుర్రాల్ని, కవచాల్ని ముట్టుకున్నంత మాత్రాన్నే సరి చేసి మా కందించాడు.

"మీకు గుర్తులేదా? మా బాబయ్య కూడా ఒక్కప్పుడు దేవతే," అన్నాడు యువకుడు.

"అవును, నిజమే. మరిచిపోయాను," అన్నాడు సెప్పీ.

"దేవుడిపై తిరుగుబాటు చెయ్యకముందు మా బాబయ్య ఒక్క పాపం కూడా చెయ్యలేదు."

"అవును, చెయ్యలేదు," అన్నాడు నికొలాస్.

"మాది చాలా మంచివంశం. అంతమంచి వంశం స్వర్గంలో ఇంకోటి లేదు. మాలో కల్లా పాపం చేసింది మా బాబయ్య ఒక్కడే."

సైతానుతో ముఖాముఖి అలా మాట్లాడటం ఎంత ఉత్సాహంగా ఉందో చెప్పలేను. ఏదో వినూతనమైన, సమ్మోహనమైన, అద్భుతమైన విషయం చూస్తుంటే ఒక వంక భయం, మరొక వంక సంతోషం పెనవేసికొని గుండె వేగంగా కొట్టుకోవటం, శ్వాస అంత కంతకు త్వరితము కావటం మీరంతా ఎరుగుదురు. అలాంటి అవస్థలోనే వున్నాం మేము. సైతాన్ను ఒక ప్రశ్న అడగాలని పించింది. కాని అడిగితే అవమర్యాదగా వుంటుందేమో నని శంకవల్ల ఆగాను సైతాను తను చేస్తున్న ఎద్దుబొమ్మను కిందపెట్టి నావంక చూసి నవ్వుతూ అన్నాడు:





# విచిత్రవ్యక్తి

"అవమర్యాద కాదు. ఒకవేళ అవమర్యాద అయినప్పటికీ అటువంటి వాటిని అట్టే పట్టించుకోను. 'మా బాబయ్యను ఎప్పుడైనా చూశావా' అని అడగాలను కొంటున్నావు కదూ ? చూడకేం ? కొన్ని లక్షలసార్లు చూశాను. నేను వెయ్యి సంవత్సరాల కుర్రాణ్ణిగా ఉన్నప్పటి నుంచీ అయన్నెరుగుదును. మా బాబయ్యకి మా వంశంలో పిల్లలందరిపైకంటే నాపైనే ఎక్కువ ప్రేమ. అప్పటినుంచి, మా బాబయ్య నరకంలోకి పడిపోయేవరకూ, అంటే నాకు ఎనిమిదివేల ఏళ్లు వచ్చేవరకూ నేనంటే ఎంతో ప్రేమగా ఉండేవాడు."

"ఎనిమిదివేల — ఏళ్లు!" అన్నాం ఒక్కసారిగా.

"అవును... నేను చిన్నవాణ్ణిగా కనిపిస్తున్నానని కదూ మీరు ఆశ్చర్యపోతున్నారు? అవును. నేను చిన్నవాణ్ణే. మీరు కాలం అని పిలిచేదుందే, అది మాకు చాల విశాలమైనది. దేవతలకి వృద్ధాప్యం రావాలంటే చాలా కాలం పడుతుంది...'' ఇంతలో నా మనస్సులో ఒక సందేహం మెదిలింది. సైతాను నావంక తిరిగి సమాధాన మిచ్చాడు; "నాకిప్పుడు మీ కాలమానం ప్రకారం పదహారువేల ఏళ్లు." నికొలాస్ వంక తిరిగి అతని మనసులోని సందేహానికి గావును సమాధాన మిచ్చాడు; "ఉహు. లేదు. దేవుడు మా బాబయ్యని మాత్రమే నరకగలోకి తోసి వేశాడు గాని మావంశంలో ఇతరులకేమీ శిక్ష వెయ్యలేదు. మా బాబయ్య ఒక్కడే పాపం చేశాడు; మొదటి పురుషుడిచేత, మొదటి స్త్రీచేత[5] కూడా పాపం చేయించాడు. మాకు పాపం అంటే ఏమిటో కూడా తెలియదు; పాపం చెయ్యటం కూడా చేతకాదు; బహుశా ఎప్పుడూ ఇలాగే ఉంటామనుకుంటాను—"

ఇంతలో బొమ్మకోట నిర్మిస్తున్న కార్మికుల్లో ఇద్దరు దెబ్బ లాడుకోసాగారు. వాళ్ల గొంతుకలు తుమ్మెదలు రొదచేస్తున్నంత హీనస్థాయిలో ఉన్నాయి. ఒకరి నొకరు తిట్టుకున్నారు; తరవాత దెబ్బల్లోకి దిగారు. మెల్లిగా రక్తం కారసాగింది. ఒకరిజుట్టు ఒకళ్లు పట్టుకుని వదలకుండా నేలమీద చాప చుట్టగా దొర్లారు. ఇదంతా చూస్తున్న సైతాను వాళ్లిద్దరినీ చేతులోకి తీసుకుని నల్లుల్ని నలిపినట్టు నలిపి చంపి పారేశాడు. జేబురుమాల తీసి చేతికంటిన నెత్తురు తుడుచుకుని తన ప్రసంగం కొనసాగించాడు; "ఇందాక ఏం చెబుతున్నాను?—ఆ— మాకు పాపం చెయ్యటం చేతకాదు. పాపమంటే తెలియదు గనక చెయ్యాలనే కోరిక కూడా ఎప్పుడూ కలగదు."

సైతాను మాటలు విచిత్రంగా తోచాయి. అతడు చేసిన పనేమిటి? చెబుతున్న మాటలేమిటి? అతని మాటలు అంతకష్టం కలిగించలేదు గాని అతడు చేసిన రెండు హత్యలు మాకు దారుణంగా కనిపించాయి. ఇద్దరు మనుషులను, తనకేమీ అపకారం చెయ్యని వారిని, నిష్కారణంగా వధించాడు; అది హత్యకాక మరేమవుతుంది? చాలా బాధపడ్డాము; కొత్త వ్యక్తిమీద మాకు ఇందాక ఎంత గౌరవం కలిగింది! ఎంత ఉదార స్వభావుడని, ఎంత సుందరుడని, ఎంతగొప్ప వాడనీ అనుకున్నాము! ఇప్పుడదంతా పోయింది! వట్టి నీచుడిలాగ కనిపించాడు.

కాని సైతాను మాత్రం ఏమీ జరగనట్టు తన దోవన తను చెప్పుకు పోతున్నాడు! తన విశ్వ సంచారం, ఏయే లోకాల్లో ఏయే వింతలు చూశాడో, మన భూలోకానికి కోట్ల యోజనాల

(58-వ పేజీ చూడండి)

## పంచతంత్రం

'మిత్రభేదం' బొమ్మల కథలు యీ వారంతో అంతమైనాయి. బొమ్మల కథల పట్ల మా పాఠక లోకం కనపరుస్తున్న ఉత్సాహాన్ని ఆసరాగా తీసుకొని 'మిత్రలాభం' కథలు కూడా బొమ్మల రూపంలో ప్రచురించాలని ఆశిస్తున్నాం. వాటి ప్రచురణ త్వరలో ప్రారంభిస్తాము.

---

(5) సైతాను, అతని పక్షంవారూ స్వర్గంనుంచి నరకానికి బహిష్కరించబడిన తరవాత దేవుడు ప్రపంచాన్ని, అంటే మన భూమిని సృష్టించాడు. భూమికి వెలుగు నిచ్చేందుకు సూర్య, చంద్ర, నక్షత్రాలను సృష్టించాడు. భూమిమీద ఆదిపురుషుడైన ఏడమ్‌ను, ఆదిస్త్రీ అయిన ఈవ్‌ను, వారితోపాటు సకల చరాచరాలను సృష్టించాడు.



పంచతంత్రం

# మిత్రభేదం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి


















పాటలిపుత్రాన పుట్టి
వర్ధమానునొద్ద పెరిగి
కాలకర్మ వశమున ఈ
అడవి చేరి సంజీవకు
డా దమనకు దమననీతి
ఫలితంగా చనిపోయెను.




















# తెల్లవారు జాము పాఠాలు

“చదివింది బుర్రకి యెక్కించు గోవాలి అంటే ప్రొద్దున్నే లేవాలి” అని సూత్రీకరించాడు మా వెంకట్రావ్. “దానికేం? లేద్దాం” అని సమర్థించాను నేనూ.

వెంకట్రావ్ నాతో కలిసి హిందీ పరీక్షకు చదువుతున్నాడు. ఇద్దరం ఒకే గదిలో వుంటున్నాం. మా గదిలో వున్న మూడవ మానవుడు పద్మారావు. పద్మారావు కూడా మాతోటే పరీక్షకి చదువుతున్నాడు. మాలో మాకు యెపుడూ అభిప్రాయ భేధాలు వుండేవి కావు కానీ, వెంకట్రావ్ ప్రతిపాదించిన యీ తీర్మానంతో పద్మారావుకి గొంతులో పచ్చి వెలక్కాయ పడ్డట్లు అయింది. ప్రొద్దుటే లేస్తే నిద్ర తక్కువవుతుందనీ, నిద్ర తక్కువైయితే ఆయుర్దాయం తరిగి పోతుందనీ, ఆయుర్దాయం తరిగిపోతే అమ్మా నాన్నా యేడుస్తారనీ, అమ్మా నాన్నా యేడుస్తే తను చూడలేననీ యింకా యేవేవో, చిచ్చి గొట్టే తల్లి పాడే లాలిపాట ధోరణిలో ప్రారంభించేడు పద్మారావు: నిద్ర తక్కువవుతే ఆయుర్దాయమేమైనా తగ్గితే తగ్గవచ్చుగాని, ప్రొద్దున్నే నిద్దర లేచినంత మాత్రాన ఆయుర్దాయం హెచ్చదూ తక్కువవదు అన్నా, నేను, యిటూ అటూ గాకుండా. పెద్ద పెద్ద వాళ్లంతా యుద్ధపు రోజుల్లో దినానికి నాల్గు గంటలే నిద్రపోయే వారట. మనం పరీక్ష కోసం వెధవది-యీ పదిహేను రోజులు-కొంచెం ప్రొద్దుండగనే లేస్తే యేమీ ప్రమాదం లేదు లెస్తూ” అన్నాడు వెంకట్రావ్.

“ప్రొద్దుటిపూట నాకు తియ్యని కలలు వస్తూంటాయి. వాటిలో నేను మునిగిపోయి, యేస్వర్గం లోనో వుంటూంటాను. వాటన్నిటినీ నష్టపోయి నన్ను ప్రొద్దుటే లేచి



కూర్చో మంటారా ఏమిట్రా - శని గ్రహాల్లారా?" అన్నాడు పద్మారావు. వాదోపవాదాల వల్లనైతే నేం, వాడి మొండుపువల్ల నయితే నేం- పద్మారావుని మాత్రం ప్రొద్దుటే లేపే వుద్దేశం విరమించు కొన్నాం.

"ప్రొద్దున్నే నాలు గంటలకి అలారం పెట్టు; మనిద్దరం లేద్దాం" అన్నాడు వెంకట్రావ్ నాతో ఆవేళ పడుకోబొయ్యే ముందు. అల్లాగే అన్నా నేను:

తెల్లారి యేడు గంటలైంది "గడియారం అలారం కొట్టిందా" అంటున్నాడు వెంకట్రావ్. అప్పుడే నేనూ లేచా - "నాలుగయిందా" అంటూ!

"నాలుగవటానికి యింకా అర్థ గంట బాకీవుంది పడుకో" అన్నాడు పద్మారావు ముసుగులో నుంచే!

తెల్లవారు ఝామున పాఠాలు చదివే పథకానికి అడుగులోనే హంసపాదు పడి నందుకు వెంకట్రావ్ చాలా నిరాశ చెందాడు. నేనూ పద్మారావూ యెంతగానో ఓదార్చాం. ఎన్ని చెప్పినా వెంకట్రావు మాత్రం బెల్లం కొట్టిన రాయిలా అట్లాగే వుండి పోయ్యాడు కాని, మనిషి ఏమాత్రమూ తేరుకో లేదు. ఏం ఖర్మ ఒచ్చి పడిందిరా, అనుకున్నాం నేనూ, పద్మారావూ.

కొంత సేపయ్యాక వెంకట్రావు గంభీరమైన ముఖంతో "రేపట్నించి యెవరు ప్రొద్దున్నే లేవకపోతే వారు మిగిలినవాళ్లకి తిన్నన్ని యిడ్లీ వుప్మా పూరీ, పెసరట్లతో సహా కాఫీ యిప్పించుగోవాలి" అన్నాడు.

"దానికేం" అన్నా నేను.

"నేను మాత్రం యీ పందేల్లో లేను బాబోయ్!" అన్నాడు పద్మారావు.

తెల్లారుతోంది. నాలు గయింద కావును- గడియారం అలారం కొట్టేస్తోంది. ఇద్దరం (అంటే పద్మారావు తప్ప,) లేచి కూర్చున్నాం. కొంచెం సేపు ఒళ్లు విరుచుగున్నాం; మరి కొంతసేపు ఆవులింతలు మేళవించాం.

"అబ్బ వెధవ దోమలు, వెధవ నల్లులూ - ఒకటే సతాయింపు! నిద్దైనా పోనియ్యలా సరిగ్గా" అన్నాడు వెంకట్రావు. 'అవును' అన్నాను నేను.

## శ్రీప్రయాగ శ్రీరామమూర్తి

ఇద్దరం పుస్తకాలు తెరిచాం. మాకన్నా ముందు లేచిన దోమలూ నల్లులూ పుస్తకాలమీద షికార్లు చేస్తున్నాయి. నాచేతా, వెంకట్రావు చేతా కునికిపాట్లు చిన్నమ్మ కళ్లు మూయించేసింది. ఇద్దరం ఒకరి కెదురు గుండా ఒకళ్లం బల్లపైనే తలలు పెట్టుకొని నిద్రపోయ్యాం. ఆరోజు అల్లా గడిచింది.

మర్నాడు నేనూ లేవలేదు: వెంకట్రావూ లేవలేదు. ఇద్దరం లేవలేదు కాబట్టి పందెం లేదన్నా నేను. వెంకట్రావ్ "అల్లాకాదు. నువ్వు నాకూ, నేను నీకూ టిఫన్లు యిప్పించుగోవాలి" అన్నాడు.

ఇద్దరం బయల్దేరాం అయ్యరు హోటలికి "యెవరికి వారు వేరు వేరుగా కూర్చోవాలి, పందెం ప్రకారం యెంతైనా తినొచ్చు" అన్నాడు వెంకట్రావు.

'సరే' అన్నా నేను.

టిఫను అయ్యాక యెవరి బిల్లు వాళ్లచేత పట్టుకొని కౌంటరు దగ్గరకి వచ్చాం. వెంకట్రావు తన బిల్లు నాచేతిలో పెట్టి, నాబిల్లు తను లాకున్నాడు.

తిక్క వదిలి పోయింది. పిచ్చి బాంద! 15 అణాలు కన్నా యెక్కువ తిన్లేక పోయ్యాడు. నాది మాత్రం మూడర్థ రూపాయల దాకా దేకింది.

వెంకట్రావుకి బిల్లు చెల్లించటానికి వుడుకు మోత్తనం వచ్చినా, పౌరుషంగా బిల్లు చెల్లించేసి నన్ను పిలవకుండానే వెళ్లిపోయాడు.

రూముకి వచ్చేసరికి పద్మారావు యింకా గుర్రు దంచేస్తున్నాడు. వెంకట్రావ్ వాడ్ని లేపాడు: పద్మారావు ఒళ్లు విరుచు గుంటూ లేచాడు.

"ఇక నుంచి పందెం లేదు" అన్నాడు వెంకట్రావు ముడుచుకు పోయిన మొఖంతో.

"ఏం?" అన్నాడు పద్మారావు.

"రూపాయిన్నర దాకా ఒదిలి పోయింది: అందుచేత" అన్నాను నేను.



గుర్రంమీద పాపాయి

ఫోటో—భాస్కర్ కృష్ణ (16)

# ★ తెల్లవారుజాము పాఠం ★

పద్మారావుకి జరిగిన కథంతా చెప్పా. వాడు అంతా విని, పెద్ద జడ్జిలాగ-"మీ యిద్దరిలో యెవరు లేవలేరో, వారు నాకు పూర్తిగా టిఫిన్ పెట్టించాలి" అన్నాడు.

నేనూ, వెంకట్రావూ ఒప్పుగున్నాం.

మర్నాడు అలారం వింటూ నేనే లేచా. వెంకట్రావు లేవలేదు! నిద్దరలోనే యెవ్వరితోనో మాట్లాడేస్తున్నాడు; ఏక ధోరణిలో.

నేను నిద్రపోతున్న పద్మారావు దగ్గరకు వెళ్ళి వాడ్ని లేపి, వాణ్ణి లేపింది నేనే నని రిపోర్టు యిచ్చా. వాడు 'సరేలే' అన్నాడు. ఆతరువాత కొంచెం సేపు మెలకువగా వుండి నిద్రపోయా. ప్రొద్దెక్కాక అందరికన్నా ఆఖర్న లేచింది నేనే. పద్మారావు నాదగ్గరకి వచ్చి "రాత్రి లేచి నిద్రపోయినందుకు హోటలుకి తీసుకు వెళ్ళాలి" అన్నాడు.

"ఆ 'కన్‌డిషన్' నిన్న చెప్పలేదేం?" అన్నా నేను.

"అయితే విను. ఈరోజు నించి యెవ్వరైతే ప్రొద్దున్న అలారం విని కూడా నిద్ర లేవరో, లేచి కూడా మళ్ళా నిద్రపోతారో, వారు నన్ను కాఫీ హోటలుకి తీసుకు వెళ్ళి పూర్తిగా టిఫిన్ పెట్టించాలి. ఇప్పటికి జరిగినదానికి మాత్రం మీ యిద్దర్నీ క్షమించేశాను" అన్నాడు పద్మారావు.

వెంకట్రావూ, నేనూ ఒప్పుగున్నాం.

మరునాడు నేను లేచి వెంకట్రావుని లేపాను - ఎక్కడ అనవసరంగా పద్మారావుని హోటల్‌కి తీసుకు వెళ్ళాసి వస్తుందోనని, ఇద్దరం కల్సి పద్మారావుని లేపేం. వాడు మంచం మీద దొర్లుతూనే "సరే లెండి" అన్నాడు.

"మేం నిద్రపోకుండా కాపలా కాయటానికి నువ్వూ లేచి కూర్చో" అన్నా నేను.

"అక్కర్లే! మీరు నిద్రపోతే నాకు తెలుస్తుంది" అన్నాడు పద్మారావు మునుగులో నుంచే.

"వీల్లేదు. నీవూ లేవాలి" అన్నాడు వెంకట్రావ్. "నన్ను హోటలుకి తీసుగు వెళ్ళకపోతే మానెగాన్సీ, నేను మాత్రం లేవను! లేవను!" అన్నాడు పద్మారావు. 'కాదు, వీల్లేదు!' అంటూ యిద్దరం కలిసి వాణ్ణి లేవదీసి కూర్చోబెట్టాం. పరీక్ష పుస్తకాలు తెరిచి ఎదురుగుండా పెట్టుకొన్నది మొదలు నిద్రా దేవత నెత్తిమీద తాండవమాడుతోంది, మా యిద్దరికీ.

పద్మారావు టీ చేస్తానని, చెప్పి స్టౌవ్ వెలిగించటానికని జారుకొన్నాడు.

వెంకట్రావు కునికిపాట్లు పడుతూ, లేస్తూ, బుర్రవచ్చి బల్లకి తగిలినపుడల్లా కళ్ళు తెరుస్తూ, మూస్తూ, తంటాలు పడుతూ వున్నాడు.

నేను స్నానానికని బయలుదేరాను - ప్రొద్దున్నే లేచినందుకు అధమం టీఅయినా పెందలకడే త్రాగ వచ్చునని!

స్టౌ వెలిగిస్తానని వెళ్ళిన పద్మారావు, అక్కడ నేలమీద పడి దొర్లేస్తున్నాడు. ఆతనికి ఒక ప్రక్కగా స్టౌ మండి పోతోంది. పంచదారని చీమలు రుచి చూస్తున్నాయి. టీనీళ్ళ కోసం పెట్టిన గిన్నెకు చిల్లువున్నది కాబోలు, పద్మారావు తలక్రింద నించి ఆనీళ్ళు కాలువలు గట్టి వున్నాయి. వాడికి యిదేమీ లెక్కలేనట్లు గుర్రుపెట్టేస్తున్నాడు.

తెల్లారు జామున లేవటం అనే మా సదుద్దేశం యించుమించు యిలాగే కొనసాగింది. ప్రొద్దున్నే లేచినందువల్ల వచ్చిన బద్ధకం తీరటానికి మధ్యాహ్నం నిద్రపోక తప్పేదికాదు. ప్రొద్దున్నే లేవాలన్న సాకుతో రాత్రి 8 గంటలకే ముసుగు తన్నెయ్యటమూ మానే వాళ్ళం కాదు.

ఒక్కొక్క రోజు ప్రొద్దున్నే లేవగానే కాస్త హుషారు వచ్చేందుకని పేకాట ఆడుకునే వాళ్ళం. మరొకప్పుడు సినీమాలను గురించి బిగ్గరగా చర్చించుకొనే వాళ్ళం; లేదా రాత్రిళ్ళు బాగా నిద్రపోనియ్యటం లేదని నల్లుల్నీ, దోమల్నీ చంపుతూ కూర్చొనే వాళ్ళం.

ఆఖరుకి పరీక్షా దినం కూడా వచ్చేసింది. ఏం రాశామో మాకే తెలియదు. రెండు నెలలు గడిచాయి: పేపర్లలో మా నంబర్ల కోసం వెదకటం దండుగే అయింది!





# జంతుకోటిలో మానవలక్షణాలు



పక్షుల చర్యలలో ఎంతకీ అర్థంకాని విషయం ఒకటి వున్నది. ఉత్తర ధృవ ప్రాంతంలో వుండే పక్షులు శీతకాలం వస్తున్నదనగా, అక్కడ నుంచీ బయలుదేరి వేలకొలది మైళ్ల దూరం ప్రయాణంచేసి దక్షిణ ప్రాంతాలకు వలస వస్తుంటాయి. అలాగే మళ్ళీ యీ దక్షిణ ప్రాంతంలో శీతకాలం వస్తున్నదనగా యిక్కడ నుంచీ బయలుదేరి వుత్తరధృవ ప్రాంతాల వైపుకు తిరిగి వలస వెళ్లుతాయి. అప్పటికి ఆ ప్రాంతాలలో వసంత ఋతువు ప్రవేశిస్తుంది.

ఎప్పుడు ఏ ప్రాంతంలో శీతకాలం వచ్చి పడుతుందో, వసంతకాలం తొంగి చూస్తుందో యీ పక్షులు ఎల్లా తెలుసుకొంటాయి- అనేదానికి సమాధానం యింతవరకు యిదమిద్ధమని తేల్చి చెప్పలేక పోయారు శాస్త్రవేత్తలు.

కానీ, కెనడాలో యిటీవల కొందరు శాస్త్రవేత్తలు చేరి, యింతవరకు నిగూఢంగా వున్న యీ విషయాన్ని కనిపెట్టటానికి కొన్ని పరిశోధనలు జరిపి ఋతువుల మార్పులను బట్టి వలస వెళ్లవలసిన సమయాలను గూర్చి పక్షులకు తెలియచెప్పే కీలకం వాటి శరీరావయవాలలోనే వున్నదని బయట పెట్టారు. కెనడా ప్రాంతంలో ఏటా సెప్టెంబరు మాసారంభంలో వేలాది పక్షులు దక్షిణపు ప్రాంతాలకు వలస బయలుదేరుతుంటాయి. అలాంటి వాటిలో దాదాపు రెండు మూడు వందల పక్షులను వలస వెళ్లనీయకుండా సెప్టెంబరు 1 న వలలువేసి పట్టుకొని, రెండు నెలల పాటు వాటిని ఎక్కడికీ ఎగిరి పోనీయలేదు. పట్టుబడిన పిట్టలను రెండు గుంపులుగా విడదీసి ఒకచోట అట్టేపెట్టి, వాటికి పగటి వెలుగు అన్నది రోజు రోజుకీ తగ్గించి చూపించారు. రెండో గుంపులోని పక్షులకు, యీ పక్షులకంటె ప్రతిరోజూ ఐదు నిముషాలసేపు ఎక్కువగా పగటి వెలుగు తగల నిచ్చారు.

ఇలా కొంత కాలం చేసి చూడగా, రోజు రోజుకీ ఎక్కువ వెలుతురు పొందుతున్న రెండో మందలో పక్షుల మర్మావయవాలు దినదినాభివృద్ధి పొందినవట. తత్ఫలితంగా - నవంబరు 9 న యీ రెండు జట్ల పక్షులనూ వదిలిపెట్టి చూస్తే, మర్మావయవాలు పెరిగి వున్న జట్టు పిట్టలు మాత్రం వెంటనే ఆ వుత్తర ధృవం వైపుకు ఎగిరి వెళ్లాయట. పగటి వెలుగు, వేడి చాలినంత సోకక, ఆ అవయవాలు సరిగా అభివృద్ధి పొందని ఆ రెండో జట్టు పిట్టలు మాత్రం యీ చోటిని వెంటనే వదిలిపెట్టి వెళ్ళకుండా, యీ మాత్రమైనా వెచ్చదనం యిక్కడ వున్నందుకు సంతోషించి, అక్కడే మరి కొంత కాలం వుండి పోయాయట.

నిజానికి సెప్టెబరు 1 న వచ్చిన శీతకాలం, నవంబరు 9 నాటికి తొలగి పోకపోయినా, కృతక పద్ధతుల ద్వారా మర్మావయవాలను పెంపొందిచినంత మాత్రం చేత, ఒక జట్టు పక్షులు తమ తొల్లిటి నివాసాలకు పోవటానికి తొందర పడ్డాయి. ఆ అవయవాలు అభివృద్ధి పొందని రెండో జట్టు పిట్టలు మాత్రం అలా తొందర పడకుండా, ఆ అవయవాలు కావలసినంత మట్టుకైనా అభివృద్ధి పొందే పర్యంతం అక్కడనే నిలచి పోవ



# జంతుకోటిలో మానవలక్షణాలు

టానికి నిశ్చయించు కొన్నాయన్న మాట.

చెట్లు, ఆకులు, ప్రకృతి వీటిలో వచ్చే మార్పులను గమనించి పక్షులు వలస వెళ్ళవలసిన సమయాలను గుర్తించు కొంటాయని అందరూ నమ్ముతూ వుండేవారు. అల్లాటిది, యీ పరిశోధనతో మారి పోయింది. ఋతువుల మార్పును వాటికి తెలియచేసే కీలకం, వాటి శరీరాల్లోనే వుందని తేలి పోయింది. ప్రకృతి శక్తే యీ పక్షులకు ఎప్పుడు వలస వెళ్ల వెలసిందీ, వాటి శరీరాల ద్వారానే సూచిస్తుంటుందన్న మాట.

పిల్ల పక్షులు పెరిగి పెద్దవై, తమంతట తాము గూటిని వదిలి ఎగిరిపోగల శక్తిని సంపాదించుకొన్నాయన్న విషయాన్ని కూడా ప్రకృతి మాతయే, తల్లి పక్షులకు తట్టి చెప్పుతుంది. ఆడపిల్లను అత్తవారి యింటికి పంపే దృశ్యం చూస్తుంటే మనకు అది విచారమో సంతోషమో తేల్చి చెప్పలేని ఒక రకమైన అనుభూతి మన మనస్సులో పొడ సూపుతుంది. ఇల్లాంటి అనుభూతియే, తల్లి పక్షి తన పిల్లలను గూటిలో నుంచి బయటకు పంపుతున్నప్పటి దృశ్యాన్ని చూసినా కూడా మనకు కలుగుతుంటుంది.

సామాన్యంగా పక్షులు ప్రతి పర్యాయమూ 5, 6 గుడ్లు పెట్టి పొదుగుతుంటాయి. ఆ గుడ్లన్నిటినీ పొదిగి పిల్లలను చేస్తాయి. ఆపిల్లలకు రెక్కలు వచ్చాక, మొట్టమొదటి సారిగా వాటికి ఎగరటం నేర్పేటప్పుడు తల్లిపక్షి చాలా ప్రయాస పడుతుంది. ఒక్కొక్క పిల్లను గూటిలో నుంచి బయటకు తోస్తుంది. అలా త్రోయబడిన ప్రతి పక్షి మొదట్లో గాలిలో ఎలా తేలిపోవాలో తెలియక, కొద్ది క్షణాలు మాత్రమే తికమక పడుతుంది. ఎలాగో రెక్కలు ఆడించి గాలిలో తేలుతూ వుండగా, తల్లి పక్షి రివ్వున ఎగిరిపోయి అవతల చెట్టుమీద వాలుతుంది. తల్లిని చేరాలన్న తొందర కొద్దీ యీ పిల్ల పక్షి కూడా దానిని అనుసరించి వెళ్ళి అదే కొమ్మమీద వాలబోతూ వుండగా మళ్ళీ ఆతల్లి పక్షి అక్కడి నుంచి ఎగిరిపోయి, యింకొక చెట్టుకొమ్మ మీద వాలుతుంది. పిల్లపక్షి అక్కడికీ తల్లిని అనుసరించి వెళ్లుతుంది. ఇలా నాలుగైదుసార్లు దోబూచు డాడాక పిల్ల పక్షికి గాలిలో ఎగరటమంటే ఏమాత్రం భయంవున్నా సాంతం తొలగిపోతుంది.

పక్షులు గూళ్లు కట్టుకోవటమనేది నిజంగా చాలా చమత్కారమైన విషయమే! అయితే యీ పనిని ప్రతి పక్షీ పుట్టుకతోనే నేర్చుకొని కొనసాగిస్తున్నదే కానీ, ఏపక్షీ అవసరమైనప్పుడు మామూలుపద్ధతిని మార్చి అందుకు తగినట్లుగా వేరే విధాన గూడు కట్టలేదు. అలా ఏపక్షి అయినా చేయగలిగిందంటే, దానికి స్వతంత్రంగా ఆలోచించి ఆచరణలో పెట్టగల సమర్థత వున్నట్లు అర్థమౌతుంది.

అమెరికాలో 'ఓరియోల్' అనే ఒక రకమైన పక్షితో కొన్ని పరిశోధనలు చేసి చూశారు. ఆపక్షి మొగపక్షితో సంయోగం పొంది, గర్భం ధరించిన తరువాత కానీ, గూడు కట్టుకోవటం మొదలు పెట్టదు. అంతకు ముందు, దానికి అందుబాటులో, మామూలుగా అది గూడు కట్టుకోవటానికి వుపయోగించే నార, నాచువంటి పదార్థాలన్నీ అట్టే పెట్టినాకూడా, ఆపక్షి ఎంతసేపూ వాటితో ఆడుకొన్నదే కానీ, గూడు కట్టేందుకు ప్రయత్నం వీసమంతైనా చేయనే లేదట. గర్భధారణానంతరమైనా, సరిగ్గా ప్రసవ సమయం ఆసన్నమయ్యే పర్యంతమూ యీ పక్షి ఆనార పీచుతోనూ వాటితోనూ అక్కడో గూడు, యిక్కడో గూడు, సగం సగం కట్టి వదిలెయ్యటం, లేకపోతే ఆ సరంజామానంతా గాలిలో నుంచి క్రిందికి పడేస్తూ వాటితో ఆడుకోవటం తప్పించి, పట్టుమని ఒక్క గూడూ పూర్తి చెయ్యదు.

శాస్త్రవేత్తల చర్చల్లో ఎక్కువగా నలిగే అంశం ఒకటి వున్నది. పక్షులు, పాములు, కప్పలు, పురుగులు యిలాటి అల్ప ప్రాణులకు నొప్పి తెలుస్తుందా అనే విషయంపై ఎంతో చర్చ జరిగింది; జరుగుతున్నది. వాటికి నొప్పి తెలుస్తుందని ఒప్పుకొనేట్లయితే, మనకు వున్నట్టే వాటి మెదడులలోనూ వ్యక్తావ్యక్త భాగాలు వున్నాయని ఒప్పుకోక

( వ పేజీ చూడండి)

 

# రెండు మహానగరాలు



(23-వ పేజీ తరువాయి)

"కంగారుపడకు ఫ్రాన్స్—నేను నిన్న సాయంత్రమే వచ్చాను—లారీగారిని ఆయన మకాంలో కలుసుకున్నాను. ఇక్కడివ్యవహారాలన్నీ ఒక ముఖానికివస్తేనేగాని, నేను వచ్చినట్టు యెవ్వరికీ తెలియనియ్యగూడదని అనుకున్నాంలే; ఇంతకీ ఇప్పుడు నీముందు యెందుకు ప్రత్యక్షంకావలసి వచ్చిందంటే కొంచం మీ తమ్ముడితో మాట్లాడవలసిన పని తగిలింది. నీ తమ్ముడికి యింతకంటే మంచివృత్తేదేనా దొరికితే బాగుండేది. —ఈ జైళ్లగొర్రెగా బ్రతికేకంటే'అన్నాడు.

ఆ రోజుల్లో గొర్రెఅనేశబ్దాన్ని గూఢచారి అనే శబ్దానికి పర్యాయపదంగా వాడుతూవుండేవాళ్లు. ఈమాట విని సాల్మన్ ముఖం ఒక్కసారి మతాబైపోయింది. అదో మేకపోతుధైర్యం తెచ్చుకుని సిడ్నీవంక చూస్తూ: 'ఏవిఁటి?' అన్నాడు.

'ఏవిఁటా—చెబుతాను—తొందరపడతావేం?— ఇప్పటికి ఒకగంటక్రితం నేను కౌన్‌సేర్‌జరీ కోర్టు జైలుగోడలచుట్టూ తారట్లాడుతూ, తమరు జైల్లోనుంచి బయటికి దయచేస్తూ వుండటం చూశాను. మీ ముఖంలో అదేదో, ఒక ప్రత్యేకతవుంది; మనిషిని ఒకసారి చూశానంటే ఆ ముఖం నాకు యెన్నాళ్లకయినా జ్ఞాపకం వుండేవుంటుంది లేండి—ప్రత్యేకం మీ ముఖం యింత జ్ఞాపకం వుండటానికి వేరేకారణంకూడావుంది. ఆ సంగతంతా తమకు జ్ఞాపకంవుంటుంది. ఒకానొకప్పుడు ఒక మిత్రునికి సంభవించిన బాధలకూ ఈ ముఖానికీ కొంత సంబంధం వుండటంచేత నాకు బాగా జ్ఞాపకం వుంది. ఇప్పుడు ఆ మిత్రుడు అంతకంటే ఎక్కువ కష్టాల్లో చిక్కుబడి వున్నాడులే—తమరు ఇక్కడ వుండటానికి కారణ మేవిఁటా అని అనుకుంటూ మీవెంటనే అనుసరించి వచ్చాను. తమరు సారా దుకాణంలో కూర్చున్నప్పుడు తమపక్కనే కూర్చున్నాను. తమ మిత్రబృందంలో కూర్చుని తాము కొస్తున్న డచ్చీలన్నీ విని, తమరు చేస్తున్న ఉద్యోగ సద్యోగాల సంగతంతా తెలుసుకోగలిగాను—అసలు మీవెంట అనుసరించి రావటంలో మొదట యే వుద్దేశమూ లేకపోయినా, తమసంగతి సందర్భాలన్నీ తెలుసుకున్న అనంతరం, వెదకబోయిన తీగ కాలికి తగిలినట్టనిపించింది.' తమతో ఒక వ్యవహారకాండలోకి దిగే సావకాశం కనిపించింది అన్నాడు కార్టన్.

'నాతో వ్యవహార మేమిటి?'అన్నాడు గూఢచారిబర్సాద్.

'ఇదిగో చూశారూ? మనం నడివీధిలో నిల్చున్నాం; ఇలాంటి విషయాలు మనం బజార్లో చర్చించుకోటం, నామాట అలా వుంచండి, మీకంత క్షేమకరమైన సంగతి కాదు. ఒక అయిదారు నిమిషాలపాటు, తమరు గనక నాకు ఏకాంత మిప్పిస్తే రహస్యంగా మనవి చేసుకుంటాను. తమరు నాతో టెల్సన్సు బ్యాంకుదాకా దయచేయవలసివుంటుంది!

'దబాయిస్తున్నారే!—'

'ఛాఛా! ఆ మాటన్నానా?'

'కాకపోతే, అక్కడికి రావలసినంత గరజు నాకేమిఁటి?'

'రాలేకపోతే ఇక్కడా సంగతి చెప్పేది లేదు—'

'అయితే చెప్పనంటారు'

'ససేమీ చెప్పను—చెప్పవలసిన గరజు నాకూ యేమంత లేదు—'

ఆ రకం మనిషితో యెలా వ్యవహరించాలో కార్టన్‌కు బాగా తెలుసు. ఆ దబాయింపుతో ఆ గొర్రె యిట్టే లొంగిపోయింది.

బర్సాద్ ప్రక్కన నిల్చునున్న అప్పగారివంక కంటకంగా చూశాడు: 'నేను చెప్పినంతా జరిగింది చూశావా?—ఈ వ్యవహారంలో నాకేమైనా ప్రమాదం సంభవించిందంటే అదంతా నీమూలంగానే' అన్నాడు.

'తొందరపడకురా బాబూ!' అన్నాడు కార్టన్. 'పెద్దవాళ్ళను అలా అగౌరవంగా మాట్లాడటం మంచిది గాదు. మీ అక్కగారిమీద వుండే గౌరవంచేత యింతదూరం నీతో వ్యవహారానికి దిగవలసివచ్చింది గాని, లేకపోతే తుండూ తుపాకీ నీతో సంప్రదింపనేది లేకుండా నేనే స్వయంగా తేల్చేసేవాణ్ణి; మనకిద్దరికీవీలుగావుండే పద్ధతిని ఒక వ్యవహారం చెబుతాను—బ్యాంకుకు పోదాం బయలుదేరు.'

'సరే పదండి'అన్నాడు బర్సాద్,

'ముందు మీ అక్కయ్యని, వాళ్లయింటి సందుమలుపుదాకా దిగవిడిచి మరీవెడదాం; అక్కా! ఇలా నా చెయ్యిపట్టుకో, ఇది మంచిపట్నంగాదు— నువ్వు ఇలా వీధులవెంట తిరగటం క్షేమంగాదు'—సిడ్నీ తన తమ్ముణ్ణి యే అఖాతంలోకి దింపబోతున్నాడో అనే ఆందోళనతో గజగజలాడుతున్న మిస్ ప్రాస్ పిల్లికూనలా అతనికి చెయ్యి అందించింది. ★



రాజ్యం పిక్చర్సువారి "దాసి"లో లక్ష్మీరాజ్యం.

# ★ మన చిత్రాల్లో టెంపో ★

పాశ్చాత్యులు మన సినిమాలు చూసినప్పుడల్లా తరుచుగా ఒక విమర్శ చేస్తారు; మన సినిమాల్లో టెంపో ఉండదని. టెంపో లేదంటే ఇక్కడ అర్థం కథాకథనం శీఘ్రగతిలో జరగదని, నెమ్మదిగా జరుగుతుందనీ. పాశ్చాత్య చిత్రాలకీ ప్రాచ్య చిత్రాలకీ టెంపోలో ముఖ్య భేదం కనిపిస్తుంది. పాశ్చాత్య చిత్రాల్లో సన్నివేశాలు త్వరత్వరగా క్లైమాక్సుకు చేరుకుంటాయి. కథలో ఏ సన్నివేశానికి ఎంత ప్రాధాన్యం ఉంటుందో అంతే ప్రాధాన్యం ఇవ్వబడుతుంది. సీక్వెన్సు తరవాత సీక్వెన్సు ఒకే లయలో నడుస్తూ అన్నీ క్లైమాక్సుకే దారితీస్తాయి. మన చిత్రాల్లో క్లైమాక్సుకు ఏవిధంగానూ ఉపకరించని సీక్వెన్సులకు అనవసర ప్రాధాన్యం ఇచ్చి చిత్రం పొడుగును పెంచటం, కథలో బిగువు సడలి, గమనం మందగించటం సాధారణంగా కనిపిస్తుంది.

కథలో టెంపో చెడగొట్టేది ముఖ్యంగా సంభాషణలు. సైలెంటు చిత్రాల దినాల్లో పాశ్చాత్యదేశాల్లో సినిమాకళ అత్యున్నత శిఖరాల నందుకుంది. అచ్చమైన, స్వతంత్రమైన సినిమాకళ సైలెంటు చిత్రాల్లో కనిపిస్తుంది. టాకీలు రావటం మొదలైన దగ్గిర్నించే సినిమాకళ క్రమంగా నాటకీయం కాసాగింది. ఈ లోపం పాశ్చాత్యులు కొంతవరకూ సర్దుకోగలిగారు గాని మనం మాత్రం సర్దుకోలేకపోయాము. మనకు సైలెంటు చిత్రాల అనుభవం అట్టే లేదు. మనకున్నదల్లా నాటకానుభవమొక్కటే. అందుచేత మన చిత్రాలు సులభంగా నాటకాలుగా తయారైపోయాయి.



డబ్బు ఖర్చుపెట్టడాని కిష్టంలేక పెళ్లి వాయిదా వేద్దామని అంటున్నాడు రాజా
**జయంతీ ప్రొడక్షన్సువారి "బంగారుభూమి"లో**
**టి. ఆర్. రామచంద్రన్, అంజలీ దేవి.**

సెల్యులాయిడ్ మీదికి శబ్దం తీసుకురాగలగటం గొప్ప విజయం కాదని ఎవరూ అనరు. టాకీల యుగం ప్రారంభమైన కొత్తలో పాల్ రోథా మొదలైన సినిమా విమర్శకులు శబ్దగ్రహణంమూలంగా సినిమా కళ ధ్వంసమైపోతుందని జోస్యం చెప్పారు. కాని పుడోవ్కిన్, ఐజెన్‌స్టీన్ మొదలైన సిద్ధాంతకారులు శబ్దగ్రహణాన్ని ఈసడించలేదు సరికదా, ఆహ్వానించారు కూడాను. సినిమాలలో శబ్దగ్రహణానికి గొప్ప భవిష్యత్తు ఉందనీ, దానివల్ల సినిమా కళకు కొత్తశక్తి వస్తుందే కాని హానికలగదనీ వారన్నారు. అయితే ఒక హెచ్చరిక చేశారు: సినిమా చిత్రం సైలెంటు యుగములో నాటకంకంటె భిన్నమైనదిగా, ఒక స్వతంత్ర కళగా పరిణామం పొందింది; సినిమాలో కెమేరాకుగల ప్రాధాన్యం మూలంగానే అది స్వతంత్రకళ కాగలిగింది; నాటకలక్షణమైన డైలాగ్స్‌ను తీసుకువచ్చి సినిమాకళ స్వాతంత్ర్యాన్ని వాడు చెయ్యరాదు; కెమేరాతో సాధించలేని ఫలితం సాధించటానికి మాత్రమే శబ్దగ్రహణ యంత్రాన్నుపయోగించాలి, అని. ఉదాహరణకి, సినిమాలో ఒకామె ఏదో భయంకర దృశ్యం చూసి సహజంగా కెవ్వున కేక వేస్తుం దనుకోండి. ఆమె

# మన చిత్రాల్లో టెంపో



బి. ఎన్. రెడ్డి సన్మానసభలో శ్రీ వరలక్ష్మి ఉపన్యసిస్తోంది.

భయతీవ్రత యావత్తూ ఆ కేకనుంచే ప్రేక్షకులు గ్రహించవలసి వస్తుంది. అటువంటిచోట విధిగా ఆ కేకను రికార్డు చెయ్యాలి. రికార్డింగు ఎక్కడ అవసరమాతుందంటే - ప్రేయసీ ప్రియులు కలుసుకుంటారు; ప్రేయసో, ప్రియుడో ఉపన్యాసం ప్రారంభిస్తారు: "నేను నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను. నా ప్రేమ అచంచలమైనది. మనల్నెవ్వరూ విడదీయలేరు..." ఇత్యాదయః ఇటువంటి ఉపన్యాసాలు వింటుంటే సౌండు ట్రాక్‌ను మనసారా తిట్టబుద్ధివేస్తుంది. చూపులో, అవయవ చాలనంలో, అసలు ఇదేమీ లేకుండా కేవలం ఆ ప్రేయసీ ప్రియులచుట్టూ ఉండే ప్రకృతి పరిసరాలను ఫొటోగ్రాఫ్ చెయ్యటంలో, ఈ అసహజమైన ఉపన్యాసానికి వెయ్యిరెట్ల శక్తితో వారి ప్రేమను ప్రదర్శించవచ్చు.

సౌండ్ ఎఫెక్ట్స్ అవసరమైన చోటనే తప్ప సౌండ్‌ట్రాక్ ఉపయోగించరాదని పుడోవ్కిన్ సిద్ధాంతం. సౌండ్ ఎఫెక్ట్స్ అంటే ఫిరంగి పేలటం, తలుపు కిర్రుమనటం కూజా నేలమీదపడి పగుల్తున్న శబ్దం చెయ్యటం, మొదలైనవే కాక మాటలను కూడా సౌండ్ ఎఫెక్ట్‌గా ఉపయోగించవచ్చును.

చార్లీచాప్లిన్ చిత్రాల్లోను, ఫ్రెంచి దర్శకుడు రీనీక్లెయిర్ చిత్రాల్లోను సంభాషణల క్లుప్తతను సాధారణంగా విమర్శకులంతా మెచ్చుకుంటూ ఉంటారు. 1928 నాటికే హాలీవుడ్ స్టూడియోలన్నీ శబ్దగ్రహణ పరికరాలను అమర్చుకుని టాకీలు తియ్యటం ప్రారంభించాయి. కాని చార్లీ చాప్లిన్ వాటిజోలికి పోలేదు. వరసగా సైలెంటు-చిత్రాలే కొనసాగించాడు. అతడు తీసిన మొదటిటాకీ "గ్రేట్ డిక్టేటర్" (1940). తరవాత ఏడేళ్ళకి "ముష్యూర్ వెర్డూ" తీశాడు. ఈ రెండు చిత్రాల్లోనూ చాప్లిన్ సంభాషణలు ఉపయోగించాడు. అయితే అవి నాటకీయంగా కనిపించవు. మాటలద్వారా తప్ప సూచించటానికి వీల్లేని విషయం ఉన్నప్పుడే చాప్లిన్ సౌండ్ ట్రాక్ ఉపయోగిస్తాడు.

మన నిర్మాతలు మన చిత్రాల్లో సంభాషణల ప్రాధాన్యము ఎంత తగ్గిస్తే అంత టెంపో పెరుగుతుంది.

టెంపో చెడటానికి ఇంతకంటే పెద్ద కారణాలు, మన చిత్రాల్లో అవసరమైన చోట కానిచోట ప్రవేశపెట్టబడే పాటలు, నృత్యాలు, కామిక్ సన్నివేశాలు. ఇవన్నీ కథను నిలబెట్టి చిత్రం పొడుగు పెంచటానికి తప్ప దేనికీ పనికిరావు.



పచ్చయప్ప కళాశాల విద్యార్థులు ఆంధ్ర వారోత్సవాలలో శ్రీ బి. ఎన్ రెడ్డిగారికి సన్మానం చేశారు. వేదికపై శ్రీ ఉయ్యూరు కుమారరాజా, కళాశాల ప్రిన్సిపాల్ కృష్ణమూర్తి అయ్యర్, బి. ఎన్. రెడ్డి, సభాధ్యక్షులు తెన్నేటి విశ్వనాథం, సముద్రాల, ఎన్. టి. రామారావు ఉన్నారు.

ప్రేక్షకులను 'ఎంటర్ టెయిన్' చెయ్యటానికే ఇవి ప్రవేశపెడుతున్నామని నిర్మాతల వాదన. ఇలా వాదించే నిర్మాతలు తమ అసమర్థతను తామే ఒప్పుకుంటున్నారన్న మాట. కథ కొంతదూరం నడిచేసరికి ప్రేక్షకులు విసుగెత్తిపోయిఉంటారనీ, వారిని 'ఎంటర్ టెయిన్' చెయ్యటానికి పాటలో, హాస్యమో ప్రవేశపెట్టటం అవసరమనీ నిర్మాతలు భావిస్తున్నారంటే వారి కథలు అంత లక్షణంగా ఉన్నాయని అర్థం. గుప్పిలిలో బిగించినట్టు ప్రేక్షకులను బిగించలేకపోతే ఆ కథ నిరర్థకమే.

అంతర్జాతీయ చలనచిత్ర రంగంలోకి దూకాలనే ఆశయం ఇటీవల భారతీయ నిర్మాతల్లో ఎక్కువగా కనిపిస్తోంది ఈ ఆశయం హర్షదాయకమైనది కాని మన చిత్రాలు ఇదే స్థాయిలో ఉన్నంతకాలం పాత పద్ధతులను విడువనంతకాలం, పాశ్చాత్య ప్రేక్షకులు మన చిత్రాలు చూసి హర్షిస్తారనేది భ్రమ.

ఇటీవల వెనిస్‌నగరంలో జరిగిన ప్రపంచ చలనచిత్రోత్సవం ఈ విషయం ఋజువు చేసింది. చేతన్ ఆనంద్ తీసిన "ఆంధియాన్" హిందీ చిత్రం చూసి అంతా పెదవులు విరిచారట. కారణం అందులో ఏకోశానా టెంపో లేకపోవటమేనట. ★

# పత్రికలలో సినిమా విమర్శలు

పత్రికల్లో సినిమా సమీక్షలు తమకు వ్యతిరేకంగా ఉన్న పక్షంలో నిర్మాతలు సాధారణంగా వాటిని చూసి కంటగించుకుంటారు. చిత్రం బాగాలేదని పత్రికలు రాస్తే ఆ చిత్రం దెబ్బతింటుందని కొందరనుకుంటారు. ఇలా అనుకోవటంవల్లనో ఏమో కొన్నాళ్లుగా పత్రికలకు ప్రివ్యూలిచ్చే ఆచారం తొలగిపోతోంది. ఆత్మవిశ్వాసంకల నిర్మాతలు ప్రివ్యూ ఆచారం కొనసాగిస్తూనే ఉండటం హర్షించదగినది.

పత్రికలు విమర్శించిన చిత్రానికి డబ్బు రాదనీ, హర్షించిన చిత్రానికి డబ్బు వస్తుందనీ అనుకోవటం భ్రమ. మన కళ్ళ ఎదుటనే ఈ భ్రమను తొలగిస్తూ అనేక ఉదాహరణలున్నాయి. పత్రికలు విమర్శించినా మెచ్చుకున్నా, చిత్రం ఆర్థికంగా విజయవంతమయ్యేదీ కానిదీ నిర్ణయించేది ప్రజలే. మన చిత్రాలు చూసేవారిలో అక్షరాస్యులకంటె నిరక్షరులే ఎక్కువమంది; పత్రికలు చదివే అలవాటున్నవారికంటే చదవనివారే ఎక్కువ. పత్రికలు ఏం రాశాయో చూసి మరీ సినిమాకు వెళ్ళేవారి సంఖ్య ఎటుచూసినా తక్కువే. ఒకవేళ పత్రికల్లో సమీక్షలు చదివినప్పటికీ ప్రేక్షకులు వాటిమీద ఆధారపడటం కష్టం. ఎందుకంటే ఒక పత్రిక రాసినట్లుగా



శోభావారి చిత్రంలో శోభగా సావిత్రి, రఘునాథ్‌గా రామశర్మ



సినిమా నటుడు శ్రీ రమణారావు

ఇంకొక పత్రిక రాయదు. పరస్పర విరుద్ధమైన ఇన్ని సమీక్షలలో పాఠకుడు ఏది నమ్ముతాడు? సాధారణంగా సినిమా చూడాలనుకునేవాడు తనకు సన్నిహితుడైన మిత్రుడి అభిప్రాయంమీద ఆధారపడతాడని తోస్తుంది. ఫలానా చిత్రం బావుందని ఎదురుగా కనిపించే మిత్రుడు చెబితే ఆ మాట తీసుకుని చిత్రానికి వెడతాడు. బాగులేదంటే మానేస్తాడు. అందుచేత పత్రికా విమర్శలు చిత్రం భవిష్యత్తును నిర్ణయించగలవనటం సాహసం.

చిత్రంలోని లోపాలను ఎత్తిచూపే విమర్శలంటే నిర్మాతలకు మరీ ఏవగింపు. ఎంత సుహృద్భావంతో రాసినా విమర్శను చూస్తే వారికి వళ్ళుమండుతుంది. విమర్శకులు చూపినవి లోపాలని కొందరు ఒప్పుకోరు. ఒకవేళ ఒప్పుకున్నా అవి ప్రజాభిరుచి ననుసరించే తమ చిత్రంలో ప్రవేశపెట్టామంటారు. ప్రజాభిరుచిని అనుసరించటమనేది ప్రతి లోపాన్నీ కప్పివేస్తుందని వారి అభిప్రాయం. కొందరు పత్రికల్లో రాసేవారికి సినిమా టెక్నిక్ గూర్చి ఓనమాలు కూడా రావని చెప్పి తమ్ముతాము సమర్థించుకుంటారు. పత్రికా సమీక్షకులు అంత అజ్ఞానులనీ, వారికి సినిమా టెక్నిక్ అనేది అజ్ఞాతమూ, అజ్ఞేయమూ



రాఘవరావూ, జమీన్దారు ఊపిరి పీల్చడానికి కూడా తీరిక లేకుండా శృంగారంలో మునిగి తేలుతున్నారు.
రాజా ప్రొడక్షన్స "పుట్టిల్లు"లో సూర్యశ్రీ, రాజారావు.

అవును. పాశ్చాత్య దేశాల్లో సృజనాత్మక కళ ఎంత అభివృద్ధి అయిందో, విమర్శన సాహిత్యంకూడా అంత అభివృద్ధి అయింది. షేక్స్పియర్ 36 నాటకాలు రాస్తే, వాటి మీద పరిగణించదగిన విమర్శ గ్రంథాలు 36 బీరువాలు నిండుతాయి. ఈ గ్రంథాలవల్ల ప్రయోజనం ఏమిటంటే, మన భావనాశక్తిని, కళను అర్థం చేసుకునే శక్తిని విస్తృతం చేస్తాయి. ★

## సినిమా వార్తలు

రాజ్యం పిక్చర్సువారి "దాసి" అనే సాంఘికచిత్రం ఈనెల 26న విడుదల కానున్నదని తెలుస్తోంది. ఒక జమీందారు బిడ్డలు లేనందున వేరే వివాహం చేసుకోబోవటం, అతని భార్య భర్తకు తెలియకుండా డాక్టరు మొదలైనవారితో లాలూచీఅయి తన దాసికి పుట్టిన బిడ్డనే తన బిడ్డగా భర్తకు చూపించటం వగైరా సంఘటనలతో ఈ చిత్రం నడుస్తుందట. దర్శకుడు రంగనాథదాసు; పర్యవేక్షణ ప్రసాద్; కథ, మాటలు, పాటలు సదాశివబ్రహ్మం; సంగీతం కొంత కీర్తిశేషుడు సుబ్బరామన్, మిగతాది దక్షిణామూర్తి. నటీనటులు ఎన్. టి. రామారావు, రంగా

## పత్రికలలో సినిమావిమర్శలు

అనీ, నిర్మాతలకు అభిప్రాయం ఏర్పడిన పక్షంలో వారికి ప్రివ్యూలివ్వటం కేవలం డబ్బు దండగ; వారి సమీక్షలకు నొచ్చుకోవటం అంతకంటే దండగ.

అయితే విమర్శలవల్ల కలిగే ప్రయోజన మేమీలేదా అనవచ్చు. గ్రంథవిమర్శ, చిత్రకళా విమర్శ మొదలైనవాటివలెనే సినిమా విమర్శలవల్ల కూడా ప్రయోజనం వుంటుంది మన దేశంలో కవిత్వమేమి, మిగతా కళారూపాలేమి, ప్రస్తుతం మందగించటానికి సరియైన విమర్శనం లేకపోవటం ఒక కారణం. ఇది ముఖ్యమైన కారణం కాదుగాని కారణం మాత్రం

భారతీయ ఫిల్మ ప్రతినిధులు అమెరికా వెళ్లినప్పుడు హాలీవుడ్ మేకప్ ఆర్టిస్టు బడ్ వెస్ట్మూర్ మనతారలకు మేకప్ రహస్యాలు ప్రదర్శిస్తున్నాడు.



రావు, శాంతకుమారి, లక్ష్మీరాజ్యం, కేలంగి, వసంత, శ్రీవత్స, దొరస్వామి, వలం మొదలైనవారు

* * *

విజయావారి "చంద్రహారం" నాల్గింట మూడు వంతులవరకూ తయారైనదని తెలుస్తోంది అయినా ఈ చిత్రం విడుదల కావటం వచ్చే మార్చి, ఏప్రిల్ నెలల నాటి మాట అని వినికిడి

* * *

అంజలీవారి "పరదేశి" షూటింగ్ చాలవరకు అయిపోయిందనీ, ఇక ఒక సెట్ మీద మాత్రమే పని మిగిలివుందనీ తెలుస్తోంది

* * *

గజానన వారి "కోడరికం" దాదాపు అయిపోవచ్చినట్లే డిసెంబరు మొదటి రెండు వారాల్లో ఎప్పుడో విడుదల కాగలదట.

* * *

"యమాకీవారీసూ" అనే ప్రసిద్ధ జపానీస్ చిత్రం ఇంగ్లీషు కామెంటరీతో సహా ఈ నెల 21 నుండీ మద్రాసు ఓడియన్‌లో ప్రదర్శింపబడనున్నది జెమినీవారు విడుదల చేస్తున్న ఈ చిత్రంలో నాలుగేళ్ళ బాలుడు కథానాయకుడట ఈ చిత్రం ఈ సంవత్సరారంభంలో జరిగిన ప్రపంచ చలన చిత్రోత్సవంలో అందరి ప్రశంసలు అందుకున్నది

* * *



రోహిణీ వారి "ప్రతిజ్ఞ"లో సారంగపాణి

లాహోరులోని ఫిలిం డిస్ట్రిబ్యూటర్లు తమ సిబ్బందిలో సగానికి సగం రిట్రెంచ్ చేశారట పాకిస్థాన్ ప్రభుత్వం భారతీయ చిత్రాలపై నిషేధం అములు చేయదలచినందున డిస్ట్రిబ్యూషన్ వ్యాపారం సన్నగిలుతుంది గనక వారీ చర్య తీసుకున్నారట కొందరు డిస్ట్రిబ్యూటర్లు తమ వ్యాపారం కొంతకాలం వరకూ మానివేసి ఫిలిం నిర్మాణానికి దిగాలని ఆలోచిస్తున్నారట

* * *

భయానక కథాచిత్రాలు తీయటంలో పేరుపొందిన హాలీవుడ్ నిర్మాత ఆల్ఫ్రెడ్ హిచ్‌కాక్ కొద్ది నెలల్లో భారతదేశంవచ్చి చిత్ర నిర్మాణం ప్రారంభిస్తాడట భారతీయ నటీనటులను, కథావస్తువును హిచ్‌కాక్ ఎంచుకోనదలచాడట ఆ సందర్భములో అతను మద్రాసుకూడా రాగలడట

* * *



పారమౌంట్ స్టూడియోలో భారతీయ ఫిల్ము ప్రతినిధులకు విందు జరిగిన సందర్భంలో భారతీయ నటుడు జెమిని. హాలీవుడ్ తార రోండా ఫ్లెమింగ్.

# బి. ఎన్. రెడ్డిగారికి సన్మానం

ప్రసిద్ధ ఆంధ్ర చిత్ర నిర్మాత, దర్శకుడు శ్రీ బి. ఎన్. రెడ్డిగారికి ఈనెల 9 వ తేదీ ఆదివారం పచ్చయప్ప కళాశాల ఆంధ్ర విద్యార్థులు సన్మానం చేశారు సన్మాన సభకు శ్రీ తెన్నేటి విశ్వనాథంగారధ్యక్షత వహించారు శ్రీ రెడ్డిగారు సినిమా కళకు చేసిన సేవను కొనియాడుతూ, తెన్నేటి విశ్వనాథం, దేవులపల్లి కృష్ణశాస్త్రి, సముద్రాల రాఘవాచారి, పచ్చయప్ప కాలేజి ప్రిన్సిపాలు, నీలంరాజు వెంకటశేషయ్య, ఎన్. టి. రామారావు, జి. వరలక్ష్మి మొదలైనవారు మాట్లాడారు.



యూనివర్సల్-ఇంటర్నేషనల్ వారి స్టూడియోను భారతీయ ఫిల్ము ప్రతినిధులు దర్శించారు
సూర్య కుమారి, ప్రేమనాథ్ కెమేరా పరిశీలిస్తున్నారు

# ★ పేదరైతు సమీక్ష ★

రాజరాజేశ్వరీవారి "పేదరైతు" చిత్రం మొన్న 12 వ తేదీన జెమినీ స్టూడియోలో పత్రికలవారికి చూపించారు ఈ చిత్రానికి దర్శకుడు కె బి నాగభూషణం, సహకార దర్శకుడు ఇంటూరి వెంకటేశ్వరరావు, మాటలు కొప్పరపు సుబ్బారావు, పాటలు కొప్పరపు సుబ్బారావు, నూరిసెట్టి సాంబశివరావు శాస్త్రి, సంగీత దర్శకుడు హెచ్. ఆర్ పద్మనాభశాస్త్రి కన్నాంబ, అంజలీదేవి, ముత్తులక్ష్మి, తులసి, లక్ష్మీప్రభ, లింగమూర్తి, శ్రీరామమూర్తి, రేలంగి, సదాశివరావు, దొరస్వామి, వెంకట్ మున్నగు వారు నటించారు

ఒకవంక జమీందారీకి, రైతాంగానికి, మరొకవంక జమీందారుకు అభ్యుదయ భావాలుగల ఆయన కుమారునికి మధ్య సంఘర్షణ ఈ చిత్రంలో ముఖ్య కథావస్తువు జమీందారీ రద్దుబిల్లు రాకముందు జరిగిన కథ అందుచేత కొంత అప్రస్తుతంగా కనిపిస్తుంది మారుతున్న ఈ రోజుల్లో జమీందార్లు తమ పూర్వాభిప్రాయాలు మార్చుకుని, రైతులకు తమంతతామే భూమిహక్కులు ఇచ్చివెయ్యాలనీ, లేకపోతే పరిస్థితులు విషమిస్తాయనీ జమీందార్లను ఈ చిత్రం ప్రబోధిస్తుంది రైతులు తమ హక్కులు సంపాదించుకునేందుకు హింస, దౌర్జన్యం అవలంబించగూడదనీ, గాంధీమహాత్ముడు చూపించిన అహింసా

మార్గంలోనే జమీందార్లపై ప్రేమపూర్వకమైన ఒత్తిడి తెచ్చి తమ హక్కులు సంపాదించుకోవాలనీ, రైతులను ఈచిత్రం ప్రబోధిస్తుంది మొదటి ప్రబోధం నూతనాదర్శాలు గల జమీందారు కొడుకు కంఠం నుంచి, రెండవ ప్రబోధం అతడు పెళ్లి చేసుకున్న పేదరైతు కూతురు కంఠం నుంచి వెలువడుతాయి.

ఈ చిత్రాన్ని సినిమా అనటంకంటె నాటకమని నిస్సందేహంగా అనవచ్చు. నాటకరంగంమీదికి కొత్తగా ప్రవేశించే ప్రతివారికీ, మాటలు చెప్పేటప్పుడు చేతులతో ఏం చెయ్యాలనే సమస్య ఎదురవుతుంది. ఈ సమస్య సినిమాలో రాగూడదు కాని ఈ చిత్రంలో నటీనటులకు ఇది పెద్ద సమస్యగా పరిణమించినట్లు కనబడుతుంది. సంభాషణలు ఉచ్చరించేటప్పుడు అంతా చేతులు ఝాడిస్తూ మరీ ఉచ్చరించారు. ఫ్రేములోంచి కాస్త కదిలితే ఎక్కడ కనిపించకుండా పోతామో అన్నటు బిగపట్టి మరీ నుంచుంటారు నిష్క్రమణలు, ప్రవేశాలు సైతం చూపబడ్డాయి. దర్శకత్వంలో నాటకీయ లక్షణాలు (థియాట్రికాలిటి) అంతటా కనిపిస్తాయి

డైరెక్టరూ, డైలాగ్ రచయితా పని సమానంగా విభజించుకున్నట్టు కనిపిస్తుంది. ఒక పిసరు డైలాగ్ రచయితే ఎక్కువ పని నిర్వర్తించారు సంభాషణలు లేని షాట్ కనిపించదు సంభాషణలతో కథ నడపటం సినిమా లక్షణం కాదు; అది నాటక లక్షణం. ఈ చిత్రంలో కళ్లకికంటె చెవులకే ఎక్కువపని తగుల్తుంది. ప్రేక్షకుల ఊహకు ఒక్క రవ్వకూడా వదిలిపెట్టకుండా పాత్రలు తమ అభిప్రాయాలు స్పష్టంగా చెప్పేస్తారు సీత (అంజలి) ఉద్యోగంకోసం కామేశంవద్దకు వచ్చి విజిటింగ్ కార్డు పంపించినప్పుడు కామేశం (ఎస్, వెంకట్) కార్డుమూసి స్వగతం కూడా మాట్లాడతాడు. సంభాషణలన్నీ రచయితే పలికినట్టున్నాయిగాని పాత్రోచితంగా లేవు. రైతులుకూడా శిష్టవ్యావహారికంలో మాట్లాడతారు.

పాటలలో రెండు పాటల రచన ప్రత్యేకంగా పేర్కొనదగివుంది. "పాలము నీదనకోని" అనే మొదటిపాట, సీత ప్రజల చేత సమ్మె చేయించటానికి పాడిన ప్రబోధ గీతం ఒకటి కావ్యరీత్యా బాగున్నాయి. సంగీతం ఎక్కువగా హిందీ బాణీలను అనుసరించి కూర్చబడినది. కన్నాంబ పాడిన రాజరాజేశ్వరీ స్తోత్రం ఒకటే విన సొంపుగా ఉన్నది పాటలు, నృత్యాలు అన్నీ వేరే ప్రయోజనం లేకుండా వాటికోసమే ప్రవేశపెట్టబడినన్నాయి.



తెరమీద ముద్దులపై సెన్సార్లు అమలు చేస్తున్న నిషేధాన్ని ఎలాగైనా రద్దు చేయించాలని బొంబాయి నిర్మాతలు దీక్షపట్టినట్లుంది.
అనిల్ పిక్చర్సువారి "షీషం" హిందీ చిత్రంలో
నజీర్ ఖాన్, నూతన్.

కథలో కొన్నికొన్ని అర్థంకాని సన్నివేశాలున్నాయి. కామేశం ప్రసాద్ (శ్రీరామమూర్తి) పంట్లాం జేబులో పిస్టల్ పెట్టి అతనివద్ద లైసెన్సు లేని పిస్టల్ వున్నదనే నేరం మోపుతాడు ఆ పిస్టల్ కామేశం ఎప్పుడు ఎట్లా జేబులో పెట్టాడో అతడే అన్నట్లు ఆ పరమాత్ముడికే తెలియదు. ఇంత చిన్న విషయం చిత్రీకరించలేకపోవటం అన్యాయం తరవాత ప్రసాద్ జైలునుండి విడుదలైవస్తుండగా కామేశం ఖైదీ దుస్తుల్లో ఎదురవుతాడు. ఏ నేరానికి ఎల్లా జైలులో పడ్డాడో తెలియజెప్పే శ్రమ దర్శకులు తీసుకోలేదు డ్రామా కోసం లాజిక్‌ను త్యాగం చేసినట్టుంది ఎస్టేటు మేనేజరు గిరీశం (లింగమూర్తి) తన ఉంపుడుకత్తె పట్నం పారిపోయినప్పుడు వెదకటానికి పట్నం బయలుదేరతాడు. అక్కడ ఇతరకార్యాలన్నీ చక్కబెట్టుకుంటాడు గాని వచ్చిన పని మాత్రం చెయ్యడు.

ఏ సినిమాలోనైనా నటీనటుల నటన బాగుంటే ఆ గౌరవం నటీనటులది; బాగు లేకపోతే ఆ అసమర్థత దర్శకుడిది. ఈ సూత్రపరిమితుల్లో ఆలోచిస్తే రేలంగి నటన మాత్రమే ప్రశంసనీయంగా వుంది. ప్రతి చిత్రంలోనూ రేలంగి స్వతంత్రించి నటిస్తున్నట్టు కనిపిస్తూనే వుంటుంది. అంజలీదేవి కూడా కొన్ని ఘట్టాల్లో చురుకైన నటన చూపింది. కన్నాంబ జమీందారిణిపాత్రకు సరిపోయింది. శ్రీరామమూర్తిని క్లోజప్ తీయకుండావుంటే బావుండేది.

మొత్తానికి ఈ చిత్రం నాటకఫక్కీలో కాలక్షేపం ప్రసాదించగలదు. ★

# ప్రశ్నలు—సమాధానాలు

శ్రీ దూర్వాసుల సుబ్బరామశాస్త్రి, జేగురుపాడు—తూ. గోదావరిజిల్లా.

కథకుడు, విమర్శకుడు ఒకే వ్యక్తి అయినట్లయితే అతనికథ ఎట్లుండును?

—లక్షణంగా ఉంటుంది. అతడు నిర్వచించిన లక్ష్య లక్షణాలతో కావ్యం లాక్షణికంగా ఉంటుంది.

భారతకథ, మరొక పురాణకథ, రెండర్థాలుయిచ్చే పుస్తకమేదైనా ఉన్నదా?

—పింగళి సూరన్నగారు రచించిన "రాఘవ పాండవీయము" అనే కావ్యం ఉంది.

* * *

ఆర్. వి. హనుమంతరావు—సికిందరాబాదు.

ప్రేమించి పెండ్లి చేసుకోవడం మంచిదా? లేక పెండ్లిచేసుకొని ప్రేమించడము మంచిదా?

—ఏది వీలుగా ఉంటే అది.

* * *

శ్రీ విహారా—హిందూ కాలేజి, గుంటూరు.

మహమ్మదీయులు "నెలవంక నక్షత్రము" గల చిహ్న మెందువలన ఉపయోగించుచున్నారు?

—మహమ్మదు పుట్టక పూర్వము అరేబియా మొదలైన రాజ్యాలలో చంద్రుణ్ని ఆరాధించేవారు ఆ దేశాలవారు చంద్రునకు ఆలయాలు కూడా కట్టించారు మహమ్మదు విగ్రహారాధన కూడదన్నారు. కాని, వెనుకటి చందంగానే చంద్రమామ భక్తి వారికి మిగిలింది.

* * *

జేగా రాధాకృష్ణయ్య నాయుడు—నెల్లూరు.

కూచిపూడి నాట్యకళ, నేటి సినిమా నాట్యకళ—ఈరెంటిలో కళాత్మకమైన దేదండీ?

—నిస్సందేహంగా కూచిపూడి నాట్యకళ.

* * *

శ్రీ వేపకొమ్మ సుబ్బారావుగారు—మద్రాసు.

దాసు వామనరావుగారు వ్రాసిన [illegible]ములు వగైరా వ్యాసాల ముఖ్యోద్దేశ మేమిటండీ?

—ఈ వ్యాసాలు "కాలక్షేపం" అనే ప్రయోజనంకోసం వ్రాయబడినవి. "కాలక్షేపం" అంటే "సత్కాలక్షేపం" అని అర్థము.

డి నారాయణ అప్పారావు—బందరు.

ఆల్ ఇండియా రేడియోలో హార్మోనియము వినబడని కారణమేమి?

—రేడియోవారిలో ఏకొంచెమో సంగీతంమీద భక్తి మిగిలివుండటంవల్ల కావచ్చు.

* * *

ముక్కామల రమేష్‌కుమార్—బుద్ధవరం.

ఉత్తరాది నటీనటులంతా వివాహాలు "హిందూ ధర్మశాస్త్రము" ప్రకారము చేసుకుంటుంటారు. కారణమేమిటండీ?

—ఉత్తరాది నటీనటులంతా హిందూ సంప్రదాయానుసారమే వివాహాలు చేసుకుంటారని మాకు తెలియదు. వారిలో హిందువులుమాత్రం హిందూ సంప్రదాయానుసారమే పెళ్ళిచేసుకుంటారు.

* * *

శ్రీ డి. రామకృష్ణరావు—తాడేపల్లిగూడెం.

తుమ్మిన వెంటనే ఏపని చేయగూడదంటారు. దీనికి కారణం ఏమిటి?

—తుమ్ము అనేది తుమ్మినవాని శరీరపరిస్థితిలో ఏర్పడిన ఒక చిన్న తుపాను కెరటం వంటిది. కొంచెంసేపు ఆగి, పని చేస్తే, మెదడున్నూ శరీరమున్నూ సరిగ్గా పని చేస్తాయి.

* * *

శ్రీ జి. వి. రమణరావు — తాడేపల్లిగూడెం.

మానవుడు జీవించుటకొరకు తింటున్నాడు తిండికొరకు జీవిస్తున్నాడా?

—జీవించుటకొరకే తినాలి కాని, యీ కాలపు మనిషి తిండికొరకే జీవిస్తున్నాడు. జీవించడానికి తిండికూడా అక్కరలేదని యోగవిద్యా ప్రవీణులు అన్నారు.

సామాన్య మానవుని జీవితాశయం యేమిటి?

—జీర్ణాశయానికి ఆహుతి వేయడమే జీవితాశయం.

* * *

శ్రీ యస్ రంగారావు—గూడూరు.

"ప్రేమ" దైవమని కాళిదాసు, ప్రేమ గుడ్డిదని షేక్స్పియర్ వ్రాశారు. వీరిద్దరిలో ఎవరి అభిప్రాయం గొప్పది?

—కవుల భావాలున్నూ వారి శబ్దప్రయోగాలున్నూ ఆయా కథా సందర్భశుద్ధిగా అన్వయించాలి షేక్స్పియరు కూడా "దాక్షిణ్యం అనేది దేవలోకం నుంచి వర్షించెడి పవిత్రోదకం" అన్నాడు. దాక్షిణ్యం, దయ, ప్రేమ అన్నీ ఏకతత్వ రూపాలు.

కవిత్వము పుట్టుకతోనే వస్తుందని నా స్నేహితుడు వాదించాడు. పుట్టుకతో భాషా పరిచయం ఎవరికీ ఉండదు గనుక, ఆసక్తితో కృషిచేస్తే కవిత్వం వస్తుందని నేను వాదించాను. ఎవరితో మీరు ఏకీభవిస్తారు?

—పూర్వజన్మలో కవిత్వ సాధకం బాగా చేసినవారికి యీ జన్మలో పూర్వజన్మ సంస్కార వాసనలవల్ల సహజమైన ప్రతిభ కొంత కవిత్వంలో కలుగుతుంది. ఈ జన్మలో కవిత్వం సాధకం చేసినవారికి యిప్పుడు తక్కువ సామర్థ్యం కలిగినప్పటికీ ఉత్తరజన్మలో కవిత్వధోరణి సహజసిద్ధంగా ఏర్పడుతుంది ఎవరికైనా సరే, ఎప్పుడైనా సరే, సాధకంలేని సామర్థ్యం గాని, నిష్కారణమైన సంస్కారంగాని ఉండదు.

* * *

శ్రీ అప్పల్ల రామారావు—బరంపురం.

అంతులేని మంది ముష్టికి బయలుదేరితే, ముష్టివేసే వారెవరు?

—అది ముష్టివాని ఆందోళన గాని ముష్టివేసే వానికి ఉండే ఆందోళన కాదు. యథాశక్తిగా ధర్మం చెయ్యడమే ముష్టివేసేవారికి ఉండవలసిన యోచన.

* * *

శ్రీ జి. రాధాకృష్ణస్వామి—హాస్పేట.

మా మిత్రులు మ్యునిసిపల్ లైబ్రరీ ముందు నిలుచబడి ఎదురుగా ఉన్న మిషన్ చర్చి కాంపౌండునందు ఉండే టీచరు ట్రెయినింగు స్కూలులోని ఆడపిల్లలను చూస్తుంటారు వాండ్లను చూడకుండా అరికట్టే పద్ధతి ఏదైనా ఉంటే తెలియజేస్తారా?

—అతని దృష్టి ఆడపిల్లలను తగలకుండా ఉండాలంటే ఒక దిష్టిబొమ్మను ఆడ పిల్లలమూకలువద్ద తగిలించవచ్చు. ★



# విచిత్రవ్యక్తి



(36-వ పేజీ తరువాయి)

దూరంలో ఉన్న ఏయే ప్రపంచ మండలాల్లో ఎలాంటి జీవులుంటారో, వారి ఆచార వ్యవహారాలెటువంటివో అన్నీ వర్ణించాడు. వింటుంటే మమ్మల్ని మేము మరిచి పోయాము; అతని వాక్సుధారసం తాగి తన్మయులమై, మంత్ర ముగ్ధ సర్పాల్లాగ నోరు తెరుచుకు చూస్తూ వుండిపోయాము. మా ఎదురుగా చనిపోయిన ఇద్దరు మనుషుల తాలూకు వితంతు భార్యలు భర్తలమీద పడి గొల్లు గొల్లున ఏడుస్తున్నారు. శవాల పక్కన ఒక మతగురువు మోకరించి చనిపోయిన వారి ఆత్మశాంతికై భగవంతుని ప్రార్థిస్తున్నాడు. ఇతరులు చుట్టూమూగి, టోపీలు తీసి చేత పట్టుకుని కన్నీరు కారుస్తున్నారు—మేము ఇదంతా చూశాము గాని సైతాను అటువైపు చూడనన్నా చూడలేదు. కాని కొంతసేపటికి ఏడుపులు, ప్రార్థనలు ఎక్కువై, ఆరోద అతనికి చిరాకు కలిగించింది. వెంటనే పక్కనున్న ఒక కర్ర తీసుకుని శవాల దగ్గర మూగిన జన్నాన్నందరినీ రెండు దెబ్బలతో నేల మట్టం చేసేశాడు. తిరిగి తన సంభాషణ సాగించాడు.

ఆ చంపబడిన జనంలో మతగురువు కూడా ఉన్నాడు! దేవత అయివుండి మతగురువును చంపేశాడు! ఎంత ఘోరం! తప్పు చెయ్యటమంటే ఏమిటో తెలియదట! చూస్తూ చుస్తూ వందల కొలది అమాయకులను, తనకేమీ అపకారం చెయ్యని వారిని వధించాడు.

కాని క్షణంలో అన్నీ మరిచిపోయి అతని మాటలు వినసాగాము. అతని కంఠం వేణు నాదంలాగ మధుర మధురంగా చెవులకు సోకి ఎక్కడున్నామో, ఏం చేస్తున్నామో తెలియని లోకాల్లోకి తీసుకు పోయింది. ఆకంఠం విని అతనిమీద పూజ్య భావం తప్ప మరొక భావం కలిగించుకోటానికే మాకు సాధ్యం కాలేదు. అమృతంలాగ ప్రవహించే అతని వాక్కులు శ్రవణేంద్రియాలతో తాగుతూ, తన పక్కన మమ్మల్ని కూర్చో నిచ్చినందుకు, తన నేత్రాల స్వర్గంలోకి తేరి పారచూడ నిచ్చినందుకు కృతజ్ఞతతో నిండిపోతూ, అతడు మమ్మల్ని ముట్టుకుంటే చెప్పలేని పారవశ్యం అనుభవిస్తూ, అక్కడే కూర్చుండి పోయాము.

(ఇంకావుంది)



# జంతుకోటిలో మానవ లక్షణాలు



(42-వ పేజీ తరువాయి)

తప్పదు. జీవశాస్త్ర రీత్యా చూస్తే స్తన్యం యిచ్చి పిల్లలను పోషించే గుణంగల జంతు ప్రాణులకే యీ మాదిరి వ్యక్తావ్యక్తతలు వుండటానికి వీలు. జీవ పరిణామంలో వీటికంటే క్రింది మెట్టుకు చెందిన పక్షులు, పాములు, కప్పలు, పురుగులు యిల్లాంటి వాటి మెదడుకి వ్యక్తత వుండటానికి వీలులేదు. అంటే వాటికి శారీరకంగా ఏదైనా గాయం తగిలినా, మనకు మల్లే వాటికి అంతబాధ తెలియకుండా వుండాలి. వానపామును నడిమికి కోశామనుకోండి. అది తెగ కొట్టుకొంటుంది. ఈ కొట్టుకోవటం అన్నది కేవలమూ దానికి కోయటం వల్ల కలిగిన బాధచేత కాక పోవచ్చు! అక్కడి కండరాల ప్రతీకార చర్య ఫలితం మాత్రమే కావచ్చు. అదే నిజమని తేలితే, —అందువల్ల కోయబడే యీజీవాలకు మేలు కలిగినా కలుగక పోయినా, శాస్త్ర పరిశోధనల కోసమని వీటిని తెగ్గోసే వారి ఆత్మలకు కొంత వూరట కలుగుతుంది. జీవహింస నిరోధక సంఘాల వారు యీశాస్త్ర కారులపై తెచ్చే ఒత్తిడి తగ్గిపోతుంది.

(ఇంకావుంది)



# అతకని బతుకులు



(19-వ పేజీ తరువాయి)

"ఎందు కఘోరించినట్టు?" అన్నాను కసిగా.

రమణి మాట్లాడ్లేదు; రెండు నిముషా లైంతర్వాత, "ఎందు కొస్తే యేంలే?" అన్నాడు దిగులుగా, పాదలవేపు చూసి.

నేను చీకటి పడ్తున్న ఆకాశం కేసి చూస్తూ, "పొద్దుపోయింది, పద" అన్నాను.

"నాకు లేని దుగ్ధ నీ కేమిట్రా?" అని రమణి నవ్వుతూ లేచి నిలబడ్డాడు. ఇద్దరం పార్కు విడిచి బైలుదేరాం.

రోడ్డుమీద నడుస్తుండగా, "చివరికి మీ నాయన కేం చెప్పావురా?" అన్నాడు, రమణి.

"నే చెప్పగలిగిం దేముంది? వాళ్లెట్లా చెయ్యదల్చుకుంటే అట్లా అవుతుంది" అన్నాను, విషాదంగా.

"నీవు పెళ్లి మానుకోవటం, శకుంతల కొరకే దనేగా?" అన్నాడు.

నాకు గూడ ఇంకో కారణం తోచ లేదు; ఒప్పుకున్నాను.

"అదిగాక - నా ఆర్థికపరిస్థితి గూడా నీకు తెలుసు" అన్నాను, మళ్ళీ.

"అందుకోసం పెళ్లి మానుకోటం తెలివి తక్కువ పని" అన్నాడు రమణి; నేను మాట్లాడ్లేదు.

"జీవితంలో ఆనందం అచ్చం డబ్బుతోనే కొనుక్కో నక్కర్లేదు" అన్నాడు, తిరిగి. నేను సిగరెట్టు వెలిగించాను.

"ఒకవేళ నీవు శకుంతల్ని పెళ్ళి చేసుకున్నా, యీ పరిస్థితిలో మార్పేమీ ఉండేది కాదుగా?" అన్నాడు రమణి.

"అప్పుడు కనీసం శకుంతలన్నా నా ఎదురుగా ఉండేది, ఇవన్నీ మరిచిపోవటానికి" అన్నాను, మెల్లిగా.

"ఒరే, ఇదంతా ఒక పెద్ద పోజు; మనమే గదా ఇంతగా ప్రేమించగలిగామనే ధీమా" అన్నాడు, నా బుజంమీద ఒకటి వేసి.

నేను కొద్దిగా నవ్వి, ఊరుకున్నాను.

"లోకంలో నీ వొక్కడివే ప్రేమించా ననుకోకు. ప్రతివాడి జీవితంలో ప్రణయ కాలం ఉండితీర్తుంది. మేనమామ కూతురు గాకపోతే, ఎదురింటివా రమ్మాయి—ఎవ రైతే నేం, ప్రేమించటానికి?" అన్నాడు రమణి; వాడి కంఠం కొద్దిగా కటువుగా ఉంది.

నేను మాట్లాడ్లేదు.

"ఏదో ఒక చిన్న విషయాన్ని పట్టుకుని జీవితం నాశనం చేసుకోటానికి సిద్ధపడ్తున్నావంటే, ఒట్టి వెధవన్నమాట" అన్నాడు, తేల్చి చెబుతూ.

నేను శూన్యంగా నవ్వి ఊరుకున్నాను.

"కాని ప్రేమించలేని వ్యక్తిని ఆజన్మాంతం భరించాలంటే సాధ్యమౌతుందట్రా?" అన్నాను, కాసేపుండి.

"ప్రేమించలేనని ఎందు కనుకోవాలి" అన్నాడు రమణి.

"ఏమో - నాకు నమ్మకం లేదు" అని గొణిగాను, సిగరెట్టవతల పారేసి.

"పెళ్ళైం తర్వాతగాని నమ్మకం కుదరదులే" అన్నాడు రమణి, కొద్దిగా నవ్వి. నే నాలోచన్లోపడి మాట్లాడ్లేదు.

"నా మాట విని తొందరగా పెళ్ళి చేసుకో—అప్పటికిగాని, యీ 'మజ్నూ' పోజులు పోవు" అన్నాడు రమణి, సలహా యిస్తూ.

## 16

మామూలుకంటె భిన్నంగా ప్రవర్తించి మొదట చివాట్లు తిన్నా, తరువాత మెచ్చుకోబడ్డవాళ్లు బహుకొద్దిమంది. భగ్నమైపోయిన ప్రేమ మళ్ళీ అతుకు తొడిగి పూలు పూయటం కథల్లోని విషయం; ఆకాశవాదుల కల.

నాతోపాటే గంతులేస్తూ ఆడుకున్న శకుంతల నన్ను మరిచిపోకపోయినా, నా కోసం వెర్రెత్తిపోయే స్థితిలో లేదు. మనుష్యులు మరిచిపోవలసిన అనేక రకపు విషయాల్లో మా చిన్ననాటి ఆటపాటలు ఒక తెగవి; ఆ రోజులు తిరిగి రాని స్వర్ణయుగాలు.

గదిబైట కుర్చీ వేసుకుని కూర్చున్నాను, సిగరెట్టు కాలుస్తూ. తూర్పున చంద్రోదయాన్ని సూచిస్తూ అరుణోదయమైంది.

తియ్యని పున్నమి రేయిని ఆనందంగా నృత్యంచేసిన వారధి అమవసనాటి కాళరాత్రిలో లోకం అదిరిపోయేట్టు మూలుగుతుంది; కాని ఆ మూలుగులో ఆశ, ఆవేదనలో ఆనందం స్ఫురిస్తై. కళలు కళలుగా వికసిస్తూ, విరిసిపోతున్న రేరాజును చూసి సముద్రం తిరిగి సంగీతం పాడుతుంది; మళ్లీ అంధకారపు దినాలు కాచుకోని ఉండవచ్చునుగాక-దొరికిన సమయం వృథా కానీయకుండా మైమరచి ఆలాపిస్తుంది, తన హృదయానందాన్ని; అంతేగాని రాబోతున్న దుర్దినాల్ని తల్చుకుని బెదిరిపోదు.

ఉదయిస్తున్న చంద్రుణ్ని చూసి లోకం మునిమునినవ్వులు నవ్వుతున్నది. నేను సిగరెట్టు పారేసి నవ్వుకున్నాను.

తర్వాత ఇంటిదగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది, నాలుగురోజులకి. రమణితో చెప్పాను. "కాని, వెళ్ళాలని లేదురా?" అన్నాను, మూలుగుతూ.

"ఏడిశావులేవోయ్- మెదలకుండా వెళ్లిరా" అన్నాడు రమణి.

నేను మాట్లాడ్లేదు.

"నాదగ్గర మళ్ళీ వెధవపోజులు పెట్టావంటే ఉతుకుతాను, జాగ్రత్త" అన్నాడు కొంచెం కోపం తెప్పించుకుని.

నేను పిచ్చిగా నవ్వుకున్నాను.

మనిషై పుట్టింతర్వాత తనకంటె ఇతరులకే తాను భయపడవలసిఉంటుంది; ఆ మర్నాడే ఇంటికి బైలుదేరి వెళ్ళిపోయినాను.

"ఆయన తొందర్లోనే వివాహం చేద్దామంటున్నాడు" అన్నాడు నాన్న నేను ఇంటికి వెళ్లిం తర్వాత.

"సరే" అన్నాను; నా హృదయం స్తబ్ధమైపోయింది.

ఆ సాయంత్రం మామయ్యఇంటికి వెళ్ళాను. శకుంతల వాకిట్లో కూర్చుని లాంతరుగ్లాసులు తుడుస్తున్నది. కళ్లెత్తి చూశాను: ఎందుకో వికారం కలిగింది.

"మామయ్య లేడా?" అన్నాను, గుమ్మంలోనుంచే.

"వస్తాడు - కూచో" అన్నది తలకాయ వంచుకునే. నేను దగ్గర్లో కుర్చీలో కూర్చుని, సిగరెట్టు వెలిగించాను.

"రోజు కేమాత్రం కాలుస్తావేం, బావా?" అన్నది శకుంతల నవ్వి.

నేను సమాధానంగా నవ్వి ఊరుకున్నాను.

"వెధవలవాట్లు - నోరంతా పాడుకంపు పుట్టదూ?" అన్నది, లాంతరుగ్లాసులు లోపలికి తీసుకెళుతూ.

"నీకేం తెలుసులే" అన్నాను శూన్యంగా నవ్వి.

శకుంతల తిరిగివచ్చి, వాకిలి చిమ్ముతున్నది. ఇంతలోకి మామయ్య చుట్ట కాలుస్తూ వచ్చాడు "ఎప్పుడొచ్చావురా?" అనుకుంటూ.

"ఆc—ఇప్పుడే వచ్చాడు; నీకు చుట్ట, ఆయనకి సిగరెట్టు! మామా అల్లుళ్ళకి బాగా అతికిపోయింది థూ!" అన్నది శకుంతల.

"ఒసే - నీ కెందుకే; మీ ఆయన కాల్చడుగా" అన్నాడు మామయ్య నవ్వి, చుట్ట నోట్లో తిప్పుతూ.

"ఆయన కాలిస్తేనా, చెప్పనేం?" అన్నది శకుంతల ధీమాగా.

"మీ ఆయనగూడ కాలుస్తునే ఉంటాడు చాటు మాటుగా—యీ కాలపు కుర్రవాళ్లు సిగరెట్లూ, సినీమాలు లేకుండా ఉంటారూ?" అన్నాడు మామయ్య, క్రీగంట శకుంతల్ని చూస్తూ.

"మా ఆయన కిట్లాంటి పిచ్చి వేషాలేం లేవు" అన్నది శకుంతల, కొంచెం సిగ్గు పడ్తూ.

"పోనీలేవే" అన్నాడు మామయ్య, నాకు దగ్గరగా మంచం వాల్చుకుని కూర్చుని.

శకుంతల వాకిట్లో నీళ్లుజల్లి, ముగ్గేసి స్తంభాని కానుకుని కూచున్నది.

"ఎందాకా వచ్చిందిరా, నీ పెళ్ళి?" అన్నాడు మామయ్య నావేపు చూస్తూ.

"బావకి పెళ్లెందుకు నాన్నా—సన్యాసం పుచ్చుకోబోతుంటేనూ" అన్నది శకుంతల, కిలకిల నవ్వి.

నాకొంచెం బిడియం వేసింది.

"ఆఁ—మీ బావ సన్యాసం పుచ్చుకుంటాడు; నీవేమో కూడా పోదువుగాని" అన్నాడు మామయ్య కొంచెం కోపం తెచ్చుకుని.

"నా ఖర్మం కాలింది" అన్నది శకుంతల దుఃఖం నటిస్తూ.

నా మనస్సు చివుక్కుమన్నది. "శకుంతల అట్లా అనటం మామూలేగా?" అన్నాను మామయ్యని సర్దటానికి యత్నిస్తూ.

మామయ్య కోపంతోటే తుపుక్కున ఉమ్మేసి, "ఏం అలవాటురా—ఇంకా, చిన్నపిల్లా, బిడ్డతల్లి కాబోతుంటేను?" అన్నాడు, కసిగా చూస్తూ. శకుంతల కోపంగా వాకిలివేపు చూస్తున్నది.

"ముహూర్తాలు పెట్టుకున్నారా?" అన్నాడు మామయ్య, కాసేపటికి తెప్పరిల్లి. నా మనస్సు ఉడికిపోతున్నది.

"లేదు—పెట్టుకుంటారు" అన్నాను అన్యమనస్కంగా. శకుంతల అక్కణ్ణుంచి లేచి, వెళ్ళిపోయింది: నా కళ్ళముందు అంతా చీకటిమయమై పోయింది.

మామయ్య క్రోధావేశంలో కాసేపు మాట్లాడ్లేదు; గుప్పుగుప్పున చుట్టపొగ వదుల్తున్నాడు. నేను కాలిపోయిన సిగరెట్టు విసిరేశాను.

"వస్తా మామయ్యా" అన్నాను కుర్చీలో నుంచి లేచి.

"నాలుగురోజు లుంటావా?" అన్నాడు తెప్పరిల్లుకొని, మామూలు ధోరణిలో.

"చెప్పలేను" అన్నాను, ఒళ్ళు విరుచుకుంటూ; మామయ్య మాట్లాడ్లేదు. నేను అక్కణ్ణుంచి వచ్చేశాను, ఇంటికి.

రఘు నన్ను చూడగానే, "అమ్మా! అన్నయ్య పెళ్ళికి పల్లకీలొ [illegible] నేనూ ఎక్కుతానే" అన్నాడు అమ్మ చీర చెరగులు పట్టుకుని గంతులేస్తూ. నా మనస్సు కొంచెం గంతులేసింది.

"ముహూర్తాలు పెట్టుకోగానే ఉత్తరం వ్రాయిస్తాను; ఒక వారం రోజులు ముందుగా వచ్చేయ్, మీ నాన్నెం తిరగ్గలు, పెళ్లి పనులకి?" అన్నది అమ్మ, నన్ను చూడగానే. 'పెళ్లి' అనుకోగానే ఇల్లు కళకళ లాడుతున్నది; ఇంటిల్లిపాదీ కొత్త ఉత్సాహంతో పరవశులౌతున్నారు

నేను మళ్ళీ గుంటూరు తిరిగి వచ్చేశాను.

## 17

అప్పగింతలప్పుడు 'రాధ' కేసి పరీక్షగా చూశాను; నా మనస్సు మబ్బులు విడిపోయిన ఆకాశంలా ప్రకాశించింది.

రాధ మెల్లిగా కళ్ళెత్తి చూసి, కనురెప్పలు దించేసుకుంది; నాకు జాలివేసింది. ఈ అమాయకురాలు తన జీవితాన్ని నా జీవితానికి పెనవేసుకుంది. యావజ్జీవితం నా పాదాలదగ్గిర అంకితం చేసుకున్నది; నాలో కరుణ పొంగి పొరలి, కళ్లు చెమ్మగిల్లినై.

తన్ను గన్న తల్లినిగూడా మరచి తనకు దొరికిన ప్రామను పట్టి పాకిపోతుంది లత; ఒళ్ళు తెలియని ఆవేశంలో తాను నమ్మిన చెట్టును గజిబిజిగా కౌగిలించుకుని అల్లుకుపోతుంది; వసంతకాలపు తియ్యనివెన్నెల రాత్రిళ్లు తన పతి ఆనందానికి మైమరచి నృత్యంచేస్తుంది; దుర్దినాల గాలిపాటుకు కదిలిపోతున్న తన నాథుణ్ని చూసి వణికిపోతుంది.

"ఒరే నీ యోగం బాగుంది: రాధలాంటి భార్య దొరకటం నీ పూర్వపుణ్యసుకృతం; మళ్ళీ పిచ్చివేషాలు వేసేవు జాగ్రత్త" అన్నాడు రమణి, తరువాత.

నేను నవ్వి ఊరుకున్నాను; రాధలో వాడికేమి అపూర్వలక్షణం గోచరించిందో నాకు తెలీలేదు.

"నిజంగా బంగారంలాంటి కోడల్ని సంపాయించావు, బావా" అన్నాడు మామయ్య, నాన్నతోటి, నేనింటుండగా. నాన్న తృప్తిగా నవ్వి ఊరుకున్నాడు.

పదహారు రోజుల పండగైపోయిం తర్వాత నేను గుంటూరు వచ్చేశాను.

"ఒరే నిజంగా ఆ పిల్ల అంత అద్భుతంగా ఉంటే, నచ్చలేదంటావేంరా?" అన్నాడు రమణి, సాయంత్రం పార్కులో కూర్చుని ఉండగా.

నేను సిగరెట్టు వెలిగించి "బాగా లేదన్నానా?" అన్నాను.

"మరి ఆ వెధవ పోజులన్నీ ఏమిటి?" అన్నాడు, క్రాస్ చేస్తూ.

నేను కాస్త నింపాదిగా, "ఒరే—నీకు బాగా తెలుసు: బాగున్న ప్రతివస్తువూ నచ్చాలని లేదు" అన్నాను.

రమణి కాసేపు మాట్లాడ్లేదు; "మీ మామయ్య కూతురంటే ఆ రోజు 'ఖాకారీ' కట్టుకొచ్చినమ్మాయే గా?" అన్నాడు, కాసేపటికి.

నేను తలకాయాడించాను.

"రాధకంటె ఏం బాగుందిరా?" అన్నాడు, నేను శకుంతల్ని గురించి పడ్డ బాధంతా వెర్రితనం క్రింద జమకట్టి.

"నే నిదివరకే చెప్పాను" అన్నాను.

"ఏడిశావులే" అన్నాడు రమణి, నవ్వి.

కాసేపుండి, "నీదంతా ఒక చిన్న 'కాంప్లెక్స్' లాగా కనబడ్తున్నది" అన్నాడు, పైవేపు చూస్తూ. నేను మాట్లాడ్లేదు.

"నీవు అనుకుంటున్నంతగా శకుంతల్ని ప్రేమించలేదేమో నని నా అనుమానం" అన్నాడు, మళ్లీ. నా కర్థం గాలేదు; అడిగాను.

"అంత గట్టిగా శకుంతల నీది కావాలనే గనక ఉన్నట్లైతే, నీవు ఏమైనా సరేనని, ఇదివరకే, శకుంతల్ని మీ మామయ్య ఇస్తానన్నప్పుడే, ఒప్పుకొని ఉండేవాడివి" అన్నాడు. నేను నిట్టూర్పు విడిచాను.

"నీకు శకుంతలకంటె ఎక్కువైం దేదో ఉన్నది-అదేమిటో వెదుక్కో" అన్నాడు, తిరిగి. నేను సాలోచనగా ఆకాశంవేపు చూశాను.

"ఇప్పుడు నీ హృదయంలో రాధ కేమీ స్థానం లేదంటావా?" అన్నాడు రమణి, కాసేపుండి; నేను చెప్పలేకపోయినాను.

## 18

"చెప్పవేంరా?" అన్నాడు రమణి తిరిగి హెచ్చరిస్తూ.

నా కళ్ళముందు రాధపెళ్లినాటి ముసిముసి నవ్వులు నవ్వింది; నా హృదయం తిరిగి నవ్వింది. నేను మాట్లాడ్లేదు.

"తర్వాత సిగ్గుపడ్డువుగానీ" అన్నాడు రమణి, నా బుజంమీద చెయ్యేస్తూ, నవ్వి.

నేను కిందివేపు చూస్తూ, "రాధ ఎట్లాగైనా నా భార్య; నా కిష్టంలేకపోయినా, యావజ్జీవితం మేమిద్దరం ఒకే బోటులో ప్రయాణం చెయ్యక తప్పదు" అన్నాను, రహస్యంగా. రమణి మాట్లాడ్లేదు.

"చీకటిపడింది — లే, పోదాం" అన్నాడు కాసేపటికి; ఇద్దరం లేచాం.

రోడ్డుమీద నడుస్తుండగా, "ఒరే—నీవు వెనకటిదంతా మర్చిపో, సాధించలేని వాటినిగురించి ఏడ్చి ప్రయోజనం లేదు" అన్నాడు రమణి; నేను చిన్నగా నవ్వి ఊరుకున్నాను.



స్టాలిన్, గోర్కీలు—దారు శిల్పం.

—శిల్పకారుడు పి. మజిన్ (టాస్ వార్తా సంస్థ)

